పట్టువలె మృదువైనది
పగడంవలె అందమైనది






HTM PIL 2647

పాండ్స్
వ్యానిషింగ్ క్రీమ్

నాజూకుగావుండే అనువైన మేకప్
ముఖ పౌడర్‌కి సంపూర్ణమైన ఆధారం
చర్మానికి ఉత్తమమైన రక్షణ

POND'S

ఓ రెండు అంతర్జాతీయ సంక్షిప్త నవలలూ, ఓ 25 మీరెప్పుడూ
చదివివుండని నూతనాంశాలతో తెలుగుపత్రికాలోకాన్ని కొత్త
శకంలోకి ప్రవేశపెట్టిన

# వెరయిటి







## ముద్దులో గల మహత్తు!

## తోడేలు పిల్లవాళ్ళు!

## యజ్ఞ సంభోగం
(అత్యంత రహస్య వేదయుక్తము)

## పాలిస్తే రొమ్ముల పొంకం పోతుందా?

ఇవేకాక ఇటువంటివే మరో 20 సంచలనాత్మక
విషయపరంపర



ప్రపంచసాహిత్యంలో
సంచలనం సృష్టించిన
ఆధునిక ఇటాలియన్ నవల

## రోమన్ ఆడది

THE WOMAN OF ROME
By ALBERTO MORAVIA

VARIETY, IV-0-41, Lal Bahadur Stadium, HYDERABAD - 500 001

## ముఖచిత్రం

సినిమా నటి రాధిక ముఖచిత్రం ఆంధ్ర సచిత్ర వారపత్రికకు మిక్కిలి అందంగా ఉంది మమ్మల్ని ఎంతగానో ఆకర్షించింది

పి పాండురంగారెడ్డి (చిత్తూరు)

* * *

ఈవారం [29 1 82] ఆంధ్రపత్రిక నటి రాధికముఖచిత్రంతో సర్వాంగసుందరంగాతయారైె ఆకర్షణీయంగా ఉంది. ముఖ చిత్రాల విషయంలో మీరుతీసుకునే శ్రద్ధ శ్లాఘనీయం

గోగిసెట్టి శివశంకర్‌రావ్ (గొల్లప్రోలు)

## కథలు

29 1 82 తేదీన రాధిక ముఖచిత్రంతో వెలువడిన వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా, చదివేందుకు ఆసక్తికరంగా ఉంది 'యువతరం కదిలిందా?' 'పంతులు బాబాయ్' కథలు చదువు చున్నంతసేపు కళ్లకు అకట్టునట్లుగా విజ్ఞాన దాయకంగా ఉన్నాయి

డి కృష్ణారావు (బైపల్లి)

* * *

నటి రాధిక ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది 'యువతరం కదిలిందా?' 'సుదరమ్మ పెండ్లి' కథలు చాలా బాగున్నాయి

టి ఎరేష్ (విజయవాడ)

* * *

జనవరి 29 రాధిక ముఖచిత్రంతో వెలువడ్డ ఆంధ్రవారపత్రిక ఆకర్షణయం కథలలో ప్రఫుల్ల చంద్రగారి 'యువతరం కదిలిందా?' కథ మాకెంత గానో నచ్చింది 'కేన్సర్ వ్యాధి కథ కమామీషూ' వ్యాసం వల్ల చాలా విషయాలు తెలుసుకో గలిగాము

ఎం నాగేశ్వరరావు, ఎం బాబూరావు (బైపల్లి)




నూతన నటి రాధిక ముఖచిత్రంతో వెలువడిన 29 1 82 నాటి మా పత్రిక మనోహరముగా ఉంది ప్రచురించిన కథానికలలో 'యువతరం కదిలిందా?' కథ ఆలోచనాత్మకముగాను మరియు యర్రగింటల్ల వరలక్ష్మిదేవిగారి 'సుందరమ్మ పెండ్లి'లో కథాంశమును తెలుపుటలో వ్యవహరించిన ప్రతిభా శైలి మాకు బాగుగ నచ్చింది

బి శ్రీనివాస్ నాయక్, రాధ, విజయలక్ష్మి శ్రీకాంత్‌నాయక (హైదరాబాద్)

* * *

నటి రాధిక ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది పెద్దకథ 'ఎన్ ఫ్రెండ్' చాలా బాగుంది

పి. వి రామనాథరావు (మధిర)

* * *

29 1 82 ముఖచిత్రం రాధిక ఆకర్షణీయంగా ఉంది కథలు చాలా మంచివి ప్రచురించారు ముఖ్యంగా 'యువతరంకదిలిందా?' ప్రస్తుత యువతరాన్ని వారి వలన సాటి ప్రజలకు కలుగుతున్న ప్రయోజనంకి చక్కటి అవగాహన

హెచ్ జి కృష్ణ (ఒరిస్సా)

## ధర్మపథం

ధర్మపథమునందు కర్మ సిద్ధాంతము పాఠకులకు బోధపడేడ విధము విశదపరచుటలో వేంకట రమణయ్య వరపత్రికకు కడు ప్రశంసనీయం.

బావట్ల వేంకట పార్థసారథి (చెరువు)

## వ్యాసాలు

29 1 28 సంచికలో ప్రచురించిన కేన్సర్ వ్యాధి—కథా కమామిషూ వ్యాసం ఎంతో విజ్ఞాన దాయకంగా ఉంది

బి వి చౌదరి (ప్రొద్దుటూరు)

* * *

రాధిక ముఖచిత్రము కనులకింపుగా ఉంది కేన్సర్ వ్యాధి, కథాకమామిషూ గూర్చి చక్కగా వివరించారు వ్యాధి ఎల ఏర్పడుతుందో విపులంగా తెలిపారు

బి సోమేశ్వరమ్మ (పాత శ్రీకాకుళము)

* * *

29 1 82 నాటి రాధిక ముఖచిత్రం ఆకర్షణీయంగాఉంది కేన్సర్ వ్యాధి, కథా కమామిషూ ప్రయోజనాత్మకంగా ఉంది

గిరాకృష్ణ (పాలవ వారు)

## సీరియల్స్

29 1 82 ఆంధ్ర సచిత్ర వారపత్రికకు నటి రాధిక ముఖచిత్రము హై లైట్ 'జీవిత వనములో కొత్తగాలి', 'తార' సీరియల్స్ రెండూ ఇంటరెస్ట్‌గా సాగుతున్నాయి

బి జంగమయ్య (సోంపేట)

* * *

29 1 82 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి రాధిక చిరునవ్వులు చిందిస్తూ ముగ్గ మనోహరమై ఆకర్షవంతంగా ఉంది సీరియల్ ''తార'', ''జీవితవనంలో కొత్తగాలి' రెండూ విభిన్న వైవిద్యంలో అత్యంత రసభరితమై సస్పెన్స్‌తో కొనసాగుతున్నాయి

హైమ సుందరరావు, హేమబిందు, ప్రియ (డోర్నకల్)

* * *

29 1 82 ఆంధ్రసచిత్రవారపత్రికక్షుణ్ణంగా చదివి ఆనందించాము ఈవారం అని కథలు, ఆణిముత్యాలే 'సెక్ ఫ్రెండ్' (పెద్దకథ) చదువుతున్నకొలదీ ఆసక్తికరంగా ఉంది మళ్ళీ వచ్చే సంచిక గురించి ఎదురుచూసేలా చేయుచుండుట్టి ఇందిరాదేవిగారి ''జీవితవనంలో కొత్తగాలి'' ఈ పత్రికకోఆకర్షణీయంగాసాగుతూం ఇంక''తార'' గురించి చెప్పనవసరంలేదు ప్రతి ఒక్క వాక్యము ఎంతో ఇంపుగా ఉంటోంది

ఎ కె రవికృష్ణాన్‌జి (హైదరాబాద్)

* * *

29 1 82 నాటి ఆంధ్రపత్రిక రాధిక ముఖ చిత్రంతో ఆకర్షణీయంగావెలువడింది సీరియల్స్ రెండూ రసవత్తరంగా ముందుకు సాగుతున్నవి ముఖ్యంగా శ్రీమతి హజరాగారి ''తార'' సీరియల్ వెరైటీగా ఉంది రచయిత్రిగారికి అభినందనలు

దామెర్ల లలితకుమారి (నెల్లూరు)

(66 వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 19–2–'82
దుర్మతినామ సం మాఘ బ ఏకాదశి
సంపుటము 75 . సంచిక 24
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు 67–60
ఆరు మాసాల చందా రు 33–80
విడిప్రతి వెల రు 1–25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నర్తకి గీత
(ఫొటో : శ్రీనివాస్ మూర్తి)



## లోకంపోకడ * శ్రీమన్



# జీవనపట్టుకొని కటు

డా॥ తాడపల్లి లక్ష్మణరావు

(గత సంచిక తరువాయి)

వినాయక్‌తో స్నేహానికి సజావైన ముగింపు విలానా అన్న సమస్య ఒకవంక బాధిస్తూ ఉంటే అంతకంటే తీవ్రమైన సమస్య మరొక ఎదురయింది గత రెండు మూడు నెలలుగా తనని పెళ్ళిచేసుకోమని పదేపదే చెప్తున్నాడు. వత్తిడి చేస్తున్నాడు ఇన్నాళ్ళ స్నేహం నటనే అని ఒక్క మాటలో చెప్పేయవచ్చు, కాని ఆ షాక్ వినాయక్ తట్టుకోలేడని మనిషిగానే కాదు వైద్య విద్యార్థిగా నాకు తెలుసు హిజ్ ఈజ్ చైల్డ్ లైక్ సైకాలజీ, ఈ కాలంలో యు ఫైండ్ సచ్ పీపుల్ వెరీ రేర్లీ ఏదోలా మభ్యపెడుతూ, అవునూ కాదు అనకుండా కాలం గడుపుతున్నాను అతనితో స్నేహాన్ని వదులుకోకుండానే ఉంటున్నాను. నాలుగు రోజుల క్రిందట మా ఛీఫ్ వినాయక్‌ను పరీక్షగా చూసి అతనిని గూర్చిన వివరాలు అడిగేరు చాలా కేజువల్‌గా జరిగింది నన్ను కలిసి సినిమాకు తీసుకు వెళ్ళడానికి వినాయక్ వచ్చాడు వార్డ్‌లో కొంచం పనుండి రూములో వినాయక్‌ని కూర్చోమని చెప్పి పని చూసుకు వొచ్చాను వెళ్ళబోతూ ఉంటే, ఛీఫ్ ఎదురయితే వినాయక్‌ని పరిచయం చేసేను. వినాయక్‌లో ఏదో ఆకర్షణుంది, ఒకసారి చూస్తే చాలు పీపుల్ బీన్ టు టేక్ ఇంట్రస్ట్ ఇన్ హిమ్ ఆ సాయంత్రానికి సినిమా ప్రోగ్రాం గురించి మరచిపోయి ముగ్గురం హస్కులో పడ్డాం.

వినాయక్‌కి తెలియకుండా డర్రాడు వినోదంకోసం అన్నట్టు ఎక్స్‌రే మొదలైన పరీక్షలు జరిపించేం ఆ సంగతి అతనికి గుర్తున్నట్టే లేదు చెస్ట్ గేవ్ స్కోప్ ఫర్ సస్పెక్టింగ్ లంగ్ కేన్సర్ ఈ వేళ సాయంత్రం సినిమా ప్రోగ్రాం పెట్టేడు సాయంత్రం అందుకే కలుస్తాడు ఈ సంగతి అతనికి చెప్పడం ఎలా, ఫర్దర్‌గా మెడికల్ ఇన్వెస్టిగేషన్స్ చెయ్యాలి చూడవే! ఎలా మొదలయినది ఎలా పరిణమించి ఇంత బాధకు కారణమౌతోందో! అంత ఆరోగ్యంగా కనుపించే మనిషికి హారిబుల్ డిసీజ్ ఉండే అవకాశాలు ..

"చూడు మేరీ! మనిషికి సానుభూతి పాటి మనుషులంటే స్నేహభావం ఇవన్నీ అవసరమే అలాగని ఇతరుల సమస్యలగురించి మనం అతిగా వర్రీ అయిపోవడం ఆరోగ్యకరమైన లక్షణంకాదు వినాయక్ నన్నావు, కాని నీ మనస్తత్వం కూడా అలాటిదే ఎందరికో ఎన్నో కష్టాలొస్తూ ఉంటాయి, కొన్ని తొలగేవి కొన్ని తొలగనివి అని తెలిసి మనం క్రుంగిపోవడం అలవాటు చేసుకుంటే జీవితంలో చేదుమాత్రమే అందుకునేవాళ్ళం అవుతాం బెటర్ టెల్ ఎబౌట్ హిమ్ హిజ్ హెల్త్ కండిషన్! నేవెళ్తా లాస్ట్ అవర్ నేనా క్లాసుకు వెళ్ళడం అవుతుంది బాయ్!"

## 2

"ఓయ్ జయా! ఫొటో ఆల్బమ్‌లోకి చూస్తూ గతంలో విహరిస్తున్నట్టున్నవ్! ప్రస్తుతానికి రావోయ్!"

నిజమే, గతంలోనే విహరిస్తున్నాను అనుకున్నాను ఆయన పిలుపు, మాటలు విన్న తరువాత వినాయక్ ఏమయ్యాడో, మేరీ ఏముందో? మేరీ లాంటి మంచి స్నేహితురాలు గురించి తెలియకుండా పోవడం స్నేహం అంటే ప్రాణం పెట్టే నాబోటి గాళ్ళకు కష్టమే!

"గతం ప్రస్తుతం కంటే తీయగా హాయిగా వుంటుందని మాకూ తెలుసు కాని, మధ్య మధ్య గతంలోకి జారుకోవడం ఎంత సహజమో ప్రస్తుతాన్ని విస్మరించకుండా ఉండడం కూడా అంత అవసరం. రవీంద్ర భారతిలో బెస్ట్ మ్యూజికల్ ప్రోగ్రామ్ ఉందోయ్"

"మీరండి! మీకంత ఇంట్రస్ట్ ఉంటే మీరు వెళ్ళండి, నాకు మూడ్ లేదు నేను రాను!"

"ఏం జయా డియర్! మీ ఒకనాటి ఆనంద్ గుర్తుకొచ్చాడా?"

దగ్గరకొచ్చి చెక్కిలి తాకి అదోలా చూట్టాడితే కోపం నటించడం కష్టమైన అని ఆనంద్ పేరుతో ఎగతాళి చేసేసరికి నవ్వొచ్చింది నవ్వేశాను ఆయన కౌగిల్లోకి వొదిగిపోతూ!

"లేదండి! శశిరేఖ ఫోటో ఒక్కటేనా ఆల్బమ్ కోసం కష్టపడి సంపాదించలేక పోయనే అని నన్ను నేను నిందించుకుంటున్నాను!"

ఈసారి నవ్వడం ఆయన వంతు శబ్దం లేకుండా ముఖమంతా వెలుగులు నిండేలా నవ్వడం ఆయన ప్రత్యేకత

"మీ ఆనందే నయం, ఇంకా ఎంతోమంది ఉన్నా తనున్న ఫోటో ఒకటి నేకు మిగిల్చాడు శశిరేఖా! మై గాడ్ రామాయణ కాలంలో పుట్టాల్సినది ఈ శతాబ్దంలో పుట్టింది మన్య, ఆనంద్ కలిసి ఎన్నిసార్లు షికారుకు, సినిమాలకు వెళ్ళారో నాకు తెలీదు కాని జయా! శశిరేఖ, ఎంత పాతకాలం మనిషంటే కాలంలో వున్నప్పుడు చేయాల్సిన పనులు చేయడానికి కూడా బెరుకూ, జంకే! ఫోటో కూడా ఇవ్వను పొమ్మంది, పార్టింగ్ గిఫ్ట్‌గా అడిగితే!"

"సో సారీ ప్రభాకర్‌గారు! స్నేహంగా తిరుగుతున్న కాలంలో ఆనందేది అడిగినా నేను కాదనలేదు, నాకు ఇవ్వాలనున్నది అడగలేదన్న విచారమే నాకు మిగిల్చినందుకు అప్పట్నుంచి ఇప్పటివరకూ ఆనందంగానే ఎంత ఇష్టమో అంత కోపం కూడా!"

మళ్ళీ వెలిగింది ఆయన ముఖం నవ్వుతో!

"మీ ఆడవాళతో వచ్చే చిక్కే ఇది విజయా! కొన్నిటిని మగాళ్ళు ఆడాళ నుంచి అడగరు ముష్కరులైతే బలవంతంగా తీసుకుంటారు, సాత్వికులైతే అడక్కుండా ఇస్తేనే పుచ్చుకుంటారు మొదటి తరగతి జనాన్ని మీ ఆడవాళ్ళు దుర్మార్గులని నిందిస్తారు, రెండవ తరగతి జనాన్ని ఉత్త మెతకవాళ్ళని గేలిచేసి చిన్నచూపు చూస్తారు అవునా?"

కాదు! ఆడది ముష్కరులంటేనే త్తెంగి కంగా ఇష్టపడుతుందని పాపులరైజ్ చేసింది చీప్ పోర్నో రచయితలు మనసు సున్నితంగాను, మాట సున్నితంగాను చేతలు సున్నితంగాను ఉన్న మగవాడంటేనే ఆడది ఇష్టపడుతుంది మన పురాణాలు రాసిన రచయితలు స్త్రీని అర్థం చేసుకున్నట్లు ఈ మధ్య కాలపు రచయితలు స్త్రీని అర్థం చేసుకోలేదు వాళ్ళు స్త్రీ గురించి చెప్పేవి రచనల ద్వారా ప్రచారం చేసేవి అబద్ధాలు లేదా హాఫ్-ట్రూత్స్ స్త్రీ స్వభావాన్ని వక్రంగా చిత్రించి చిత్రించి స్త్రీ మనస్తత్వాన్నే మార్చేశారు, ఈ కాలపు రచయితలు

"నువ్వు ఇదీ!" అని పదేపదే అంటే అదే అయి కూర్చుంటుందన్నది ఎలిమెంటరీ సైకాలజీ పాఠం "

"జయగారూ! మీరు చాలా చదువుకున్నవారు, ఆలోచించే శక్తి గలవారు, ఉపన్యాసం ఇవ్వగల సమర్థత ఉన్నవాళ్లు అన్నీ ఒప్పుకుంటాను బయటకు వెళ్ళడానికి తయారవుతారా? రవీంద్ర భారతిలో బెస్ట్ "

"ఆగండి ప్రభాకర్‌గారూ! రవీంద్రభారతి మెట్లెక్కి లోపలకు ప్రవేశించి కుషన్ ఛైర్‌లో కూర్చుని ఆర్టిస్టును గురించిన ఇంట్రడక్షన్ వినడం, అదో ఆనందకరమైన అనుభవం అయిదు నిముషాలు, రడీ అవుతాను ఇంక రడీ అవడం కుదిరేదెట్లా, వదలండి తొందర చేసేదీమీరే, అడ్డు తగిలేదీ మీరే"

"ఆల్‌రైట్, గ్రీన్ సిగ్నల్, పాసేజ్ క్లియర్ వెళ్ళి తయారయి రండి జయాదేవిగారు!"

## 3

"ఏం జయా! ఊరికి కొత్తే నట్లు ఏవిటి విండోలోంచి అదేపనిగా చూస్తున్నావ్, కార్లో కూర్చున్న దగ్గర నుంచి ఉలుకూ పలుకూ లేదు ఎంత మెల్లగా కారును పోనిస్తున్నది నువ్వేదైనా మాటాడితే వివి సంభాషణ సరదా తీర్చుకుందామని"

"ఆఁ అబ్బే ఏం లేదూ! ఇంకా గతంలోనే ఉన్నాను, ఒక స్నేహితురాలు గురించిన జ్ఞాపకాలు "

"జయా! స్నేహితురాలు స్నేహితురాలి కాలంమీద డిమాండ్ చేసినా పరవాలేదు, ఆ స్నేహితురాలి భర్త ప్రెషస్ లీజర్ టైమును మింగేయడం క్షమార్హంకాదు"

"రోజూ కలిసి కాపురం చేస్తున్నవాళ్ళమే కదండీ! పాత స్నేహితులు అప్పుడప్పుడు



మాత్రమే గురు కొస్తారు వాళ్ళను జ్ఞప్తికి తెచ్చుకోవడం క్షమార్హం కాదంటే, క్షమార్హమైనదంటూ జీవితంలో ఏదీ మిగులదు!''

"గతంలో అనుభవించిన సుఖాలను తలచుకుని మురియడమో, భవిష్యత్తును గూర్చి కలలు కంటూ సంబరపడిపోవడమో తప్ప చాలామంది మనుష్యులకు ప్రస్తుతంలో ఆనందంగా కాలాన్ని గడపడం అంత సులభంగా అబ్బని వేర్రితనం.''

"ఏనండి ప్రభాకర్‌గారూ! శశిరేఖ గురించి మీ నెమరువేయడాలు, కలలు కనడాలు ప్రస్తుతంలో ఆనందంగా కాలాన్ని గడపగలిగే వేర్రితనానికి బుజువులేనా?''

"జయా! నీతో వచ్చే ఇబ్బందే ఇది ఏదో తోచింది పదేపదే అంటే ఆ అన్న విషయాన్నే మరకే వర్తిస్తే, ఎలా? నేనన్నదాంతో ఏకీభవిస్తావా, అదివాస్తవం కాదంటావా?''

"ఓహో! సంభాషణలోకి దించడానికి ఇదో ఎత్తుగడా? మీ వెనకాలఉన్న వాళ్ళ నోరు మెదపకుండా వుండడం మంచిదని సిటీస్‌లో రోడ్డు ప్రమాదాలను తగ్గించడంలో తోడ్పడే విన్నో తీసుకోవలసిన జాగ్రత్తలలో అదొకటని గుర్తు చేయాలా?''

"అబ్బే అవసరం లేదు రోడ్ను జాగ్రత్త గురించి ప్రస్తుతానికి ఉపన్యాసం ఇవ్వ ప్రయత్నం మాను! ఎత్తుగడన్నావు కాక హాయిగా సాయంత్రం షికారుకు బయలుదేరితే మూతి ముడుచుకుని కూర్చునే ది భార్య అయితే ఆ మగాడు ఏమయిపోవాలి?''

"ఏమీ అవడు ఆయన ఆలోచనల్లో ఆయనుంటాడు! కలిసి ఉన్న ప్రతీ క్షణం భార్యా భర్తలు వసపోసినపిట్టల్లా వాగుతూనే ఉండాలా? ఉండాలని నేనెక్కడా వినలేదు!''

"ఇప్పుడు విను, ఇద్దరు కంపెనీఅన్నారు, ఎందుకని? ఒకడైతే మాట్లాడగలిగేది మనస్సుతోనే, ఆలోచనలో పడిపోతాడు ఇద్దరైతే ఆలోచనల్ని వలకు పెట్టి సంభాషణ సాగిస్తారు. ఒకరికొకరు కంపెనీగా కాలక్షేపం జరపడానికి వదలుకో కూడని మంచి అవకాశం''

"మీ వాగుడు వరదాను తీర్చడం ఎవరికీనా సాధ్యం కాదు, నావలన కానిపని అది!''

"అంటే డియర్! యూ కన్సిడర్ మి ఏజ్ ఎటాకెటివ్ ఫెల్లో?''

"నేను తెలుగులో అన్నాను మీరు ఇంగ్లీషులో అన్నారు, నా భావం అదేకదండీ!

# జీవనపట్టు కానికటు

ఒకసారి అనడమే జంకుతూ అన్నాను, ఆ వీల్‌మీద కంట్రోల్‌పోయి పేవ్‌మెంట్‌మీదకి తోలేస్తారుకదాని రెండోసారి అని ''

"యూ సిల్లీ! ఏన్నాళ్ళనుకున్నావ్ ఈ చక్రం తిప్పడంలో నా అనుభవం? నన్ను ఉత్త వాగుడుకాయను అన్నది నువ్వు కాబట్టి పట్టించుకోను నువ్వైనా సరే నా డ్రైవింగ్ స్కిల్‌ని అవమానించ ప్రయత్నిస్తే, తక్కువ చేసి మాట్లాడితే పట్టించుకొందును ''

"పట్టించుకొని ఏం చేసారు?''

"ఇంటికెళ్ళిన తర్వాత చెప్తాను ''

మొహాన్నంతా వెలిగిస్తూ నిండుగా నవ్వే, నిజంగా ఎదుట మనిషి దూషించినా నవ్వే సమర్థతున్న మనిషి ఇలాంటి మనుషులకు సరదాకైనా కోపం తెప్పించడం ఇంపాసిబుల్.

> ## సార్థకత
>
> పుస్తకాలు రాయడం గొప్పకాదు
> రాసింది పదిమందికి చెప్పాలి.
> రాసింది చెప్పడం గొప్పకాదు,
> చెప్పింది చేసి చూపాలి.
> అప్పుడే
> రాసిన దానికి
> రాసినవాడికి
> సార్థకత!
>
> పొత్తూరు రాజేంద్రప్రసాద్‌వర్మ

బాగా కోపం వస్తే ఆయన ముఖం ఎలా గుంటుందో చూద్దామని పెళ్ళయిన నుండి నేటి వరకూ నాకు తీరని ముచ్చట మనిషన్నవాడు అన్ని రకాల ఉద్రేకాలకూ లోనయ్యే స్వభావం కలవారవాలని నా అభిప్రాయం కాకుంటే జీవితం చప్పిడి కూడు భుజించడంలా ఉంటుంది ఉద్రేకాలన్నిటినీ జయించేస్తే బ్రతకాల్సింది సంసారిగా కాదు, ఏదో అడవిలోకో, హిమాలయాలకో సన్యాసిగా తపస్విగా పోవడానికి

"జయాదేవిగారూ! రవీంద్రభారతిచేరుకొని కొన్ని నిముషాలయింది ''

"చాల్లెండి! కొన్ని క్షణాలు కూడా అవలేదు ''

"నాది సీకో వాచి వరల్డ్ ఫేమస్ బ్రాండ్ ఇంతకు ముందు నా సమర్థతను శంకించబోయావు పోనీలే అని ఊరుకున్నాను ఇప్పుడు నా సీకో వాచీనే ''

"నేను దిగుతున్నాను, లోపలికి వెళ్ళి హాయిగా కూర్చుంటాను మీ సీకో వాచి సంగతి వాచి రిపేరర్ దగ్గరకు వెళ్ళి తేల్చుకురండి ''

"నా వస్తువులమీద నాకు నమ్మకం ఉంది గాని పద!''

"హేయ్ విజయా! వాట్ ఏ ప్లెజెంట్ సర్ప్రైజ్!''

"మేరీ నువ్వా! రేర్ కో యిన్సిడెన్స్, క్రితం క్షణం వరకూ నీ గురించే ఆలోచిస్తున్నాను ''

"థింక్ ఆఫ్ ది డెవిల్ ''

"ఏయ్ మేరీ! ఈయన వినాయక్‌కదూ?''

"ష్యూర్! ఆయన ఎత్తుకున్న నాటీ చైల్డ్ జూనియర్ వినాయక్!''

"ఈయన ప్రభాకర్, మావారు ఇక్కడ స్టేట్‌బ్యాంకులో ఆఫీసరు ఈమె మేరీ అని నా స్నేహితురాలండి, ఆయన వినాయక్ ''

మగాళ్ళిద్దరూ మాటల్లో పడి ముందు నడుస్తున్నారు, వెనుకగా మేము వాళ్ళని ఫాలో అవుతున్నాం ఉండబట్టలేక అడిగేశాను—

"ఏమే మేరీ! మనం ఆఖరిసారిగా కలిసినపుడు వినాయక్‌కు లంగ్ కేన్సర్ ''

"ఓహ్! దట్ వాజ్ ఎ మిస్టేక్, ఎ షాడో వాజ్ మిస్టేకన్ ఫర్ మేలిగ్నెంట్ గ్రోత్ ఐయామ్ రియల్లీ లకీ!''

"మరి మీ ఫారెన్‌లో ఉండే బావ ''

"సెల్ఫిష్ జంటిల్మన్! అక్కడో అమెరికన్‌ని పెళ్ళి చేసుకుని స్థిరపడిపోయాడు! అందుకే అన్నారు మేరేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్ అని ''

"అవును అందుకే జీవనపట్కం ఇటు నుంచి చూస్తే అగపడేవీ అటు వాస్తవంగా ఉండకపోవచ్చు!''

"ఏమిటీ! రవిశంకర్ సితార్ ప్రోగ్రామ్‌కు వెళ్తూ అంత ఫిలసాఫికల్‌గా మాట్లాడుతావు? వాళ్ళు మరీ ముందైపోయారు, కొంచెం నడకవేగం పెంచు!''

"యూ ఆర్ ది సేమ్ మేరీ! చాలా ఆనందకరమైన రోజే ఇది ''

(అయిపోయింది)

# ఫాలాక్షుని డైరీ

## కలియుగ కామధేనువు!

కర్నాటక రాష్ట్రంలోని డెయిరీలోని పాల స్టేషన్ ఫ్రీజియన్ జాతి ఆవు మూడుసార్లు ఎలాగో 105.9 లీటర్ల పాలిచ్చి ప్రపంచ రికార్డును బద్దలు చేసిందట

## గేదెల పందాలు!

భారతదేశంలో ప్రప్రథమంగా కర్నాటక రాష్ట్రంలో బెంగుళూరుకు 10 కిలో మీటర్ల దూరంలో ఉన్న ఎలహంక గ్రామంలో గేదెల పందాలు జరుగుతున్నాయి. జనవరి 16న జరిగే ఈ గేదెల పరుగుపందాలకు ఐదులక్షల ఖర్చు పెట్టి స్టేడియం కడుతున్నారట గుర్రప్పందాలలా అన్నమాట

## 'గాంధీ' చిత్రానికి రవిశంకర్ సంగీతం!

సర్ రిచర్డ్ అటెన్‌బరో బహు వ్యయ ప్రయాసలతో నిర్మించిన "గాంధీ" సినిమా సంగీతం సమకూర్చింది ప్రఖ్యాత సితార్ విద్వాంసుడు రవిశంకర్ ఇంగ్లీషులో తీసిన దీనిని ప్రస్తుతం హిందీలోకి డబ్ చేయాలని ఆలోచిస్తున్నారట ఇంకా ఫ్రెంచి, స్పానిష్, జర్మన్, ఇటలీ, రష్యా భాషలలోకూడా డబ్ చేస్తారట

## పెరిగిపోతున్న రోడ్డు ప్రమాదాలు!

తమిళనాడులో రోడ్డు జాగ్రత్తలెన్ని విధాలుగా తీసుకుంటున్నా రోడ్డు ప్రమాదాలు రోజురోజుకూ ఎక్కువై — పెరిగి పోతున్నాయని కోయంబత్తూరు డిప్యూటీ ఇన్స్‌పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు అన్నారట 1981వ సంవత్సరంలో ప్రతి లక్షమంది జనాభాకు వ్యక్తులు రోడ్డు ప్రమాదంలో చనిపోయారట 1980లో 64 రోడ్డు ప్రమాదాలుంటే 1981 నాటికవి 69గా మారాయట 1981లో 195 హత్యలు రికార్డయ్యాయనీ, అందులో ఇరవై రెండు హత్యలు కోయంబత్తూరులో జరిగాయని ఆయన చెప్పారట

## విరక్తితో నిరుద్యోగిని ఆత్మహత్య!

యోగాంబాల్ అనే ఒకామె బి.య్యే పాసయి తమిళనాడు నిర్వహించిన సర్వీసు కమీషను పరీక్షలో పాసయి, మద్రాసులో జరిగిన యింటర్వ్యూలో ఫెయిలయిందట దాంతో ఆమె మనస్సువిరిగి పచ్చ పప్పుతిని నిండుప్రాణం తీసుకున్నదట ఆమెకు 28 ఏళ్లట

## వ్రతభంగం!

కర్నాలులో ఓ హత్య కేసులో పట్టుబడిన మంగమ్మఅనే ఓ కన్నెపడుచుకు కొన్ని అద్భుతశక్తులున్నాయట ఆమె ఎప్పుడూ నగ్నంగానే వుంటుందట ఆమెను కోర్టులో హాజరు పరుపచూస్తే తాను అక్కడికి కూడా నగ్నంగానే వస్తానని కోర్టు ఆవరణ వరకూవచ్చి కారులో కూర్చుని, తన లాయరుద్వారా న్యాయమూర్తికి ఖబురుపెట్టిందట న్యాయమూర్తిగారు ఆమె అలా రావీల్లదంటే, నేను మీరు చెప్పినట్లు రాను అది నా వ్రత భంగం పొమ్మందటామె — ఐసీ! ఎక్కడ?

## దానమిచ్చిన కళ్లని కాపాడుకుంటూ కాలిపోయిన వికలాంగుడు!

పుట్టుక నుంచే రెండు కాళ్లూ చచ్చుపడి పోయిన 18 ఏళ్ల సూర్యకాంత్ పాండ్య అనే ఓ యువకుడు అమ్రేలి జిల్లాకు చెందిన మోరవ గ్రామంలో తన యింటిలో నిప్పంటించుకు జీవితాన్ని అంతం చేసుకుంటూ రెండు కళ్లనూ చేతో కాపాడుకున్నాడట అతను తన మరణానికి ముందు తన రెండుకళ్లను తన మరణానంతరం వెంటనేవచ్చి తీసుకోవాలనీ తానాత్మహత్య చేసుకుంటున్నాననీ నేత్రరక్షణ ట్రస్ట్‌కు ఉత్తరం రాశాడట వారువచ్చి కాలిపోయిన అతని శరీరాన్ని తీసుకుని కళ్ళు పరిశీలిస్తే రెండుకళ్ళూ చక్కగా ఉన్నాయట.

## 36 ఏళ్ల కర్ఫ్యూకి ముగింపు!

క్రొత్తగా ఏర్పడిన సౌత్ కొరియా కాబినెట్ గత ముప్పయ్యారేళ్ళగా అమలులోఉన్న "కర్‌ఫ్యూ" మొన్న 5వ తేదీ అర్ధరాత్రినుంచి రద్దు చేశారట రక్షక స్థావరాలలో కర్ఫ్యూ వుండనే ఉంటుందని ఆ కాబినెట్ ప్రకటించిందట 36 ఏళ్ళ కాలం కర్ఫ్యూ వుంటే నో కామెంట్స్

## దారుణహత్యలకి దారితీసిన దాయాది వైరం!

శ్రీకాకుళం నెక్కలపట్టి గ్రామానికి చెందిన అప్పలసూరి అనేఅతన్ని జనవరి ఏడవ తేదీన అతను పొలంలో ఉండగా చంపి, శవాన్ని తగులబెట్టేశారట ఎవరో ఈ విషయం తెలిసిన అప్పలసూరి కొడుకులు యిది తమ పెద్దనాన్నపని అని తలచి అప్పలసూరి అన్నగారు కృష్ణమూర్తి ఇంటికివెళ్లి అతన్ని కొట్టికొట్టి చంపేసి, అంతతో ఆగక ఆ కృష్ణమూర్తి ముగ్గురు చెల్లెళ్లను కూడ కొట్టి చంపేశారట





# ఫాలాక్షుని డైరీ

**అంటువ్యాధులని వ్యాప్తిచేసే ఆసుపత్రి !**

ప్రపంచ చరిత్రను కాన్పూరుకు చెందిన యు ఎస్ ఇసు ఇ వెంటర్నిటీ ఆసుపత్రిహడలగొట్టేసిందట సమాన్యంగా ఆసుపత్రుల వాతావరణంవల్ల లేనిపోని రోగాలు కొన్ని రావడం కద్దట ఆ రోగాలు రావడం ఐదునుంచి పదిహేను శాతం వుంటుందట కానీ యీ ఆసుపత్రిలో అవి తొంభై ఆరుశాతమట కాన్పూరు మెడికల్ కలేజి ప్రొఫెసర్ ఆర్ కె గుప్త ఆసుపత్రి వతావరణాన్ని పరిశీలిస్తే అక్కడి గాలిలో పేదోజనిక, మరి యు నాన్ పేదోజనిక బాక్టీరియా అధికశాతంలో వున్నదట తత్ఫలితంగా ఆ ఆసుపత్రిలోని 876 రోగులలో 840 మందికి మైక్రోబియల్ రోగాలు ఉత్పన్నమైన్నా ఆ ఆసుపత్రిలో జేరినందువల్ల వచ్చాయట ఇది ప్రపంచ రికార్డట — కాదూమరి ?

**మూఢోజులకో హత్య !**

ఉడయాపట్టి అనే గ్రామ మిరస్తుదారు 56 ఏళ్ల పెరియణ్ణ గవుండరు తన సంపాదనంతా ఎంచక్కా విందుకు మందుకు, మహిళకు ఉపయోగించి పారేస్తున్నాడట ఈ స్త్రీలోలత్వమూ, మధుమైకంతో ఆస్థి అంతా నాశనం చేయడన్ని ఆయన కొడుకు కందసామి అడ్డుపెట్టాడట దానికాతండ్రి ఒప్పుకోకపోయేసరికి అతనువో ఇద్దరు స్నేహితులతో తండ్రిని రెక్కలు విరిచికట్టి కర్రతో బాదాడట అం ప్రభుత్వ ఆసుపత్రిలో ఆ పెరియణ గవుండరు చనిపోయాడట సేలంలో 1981లో మొత్తం 125హత్యలు జరిగాయట అవగా మూఢోజులకొక హత్యన్నమాట

**తిరుమలలో భార్యాభర్తల ఆత్మహత్య !**

సేలంకు చెందిన 30ఏళ్ళ అమర్ నాధ్ ఆతని భార్య 25 ఏళ్ల ఉషారాణి తిరుపతివెళ్లి, తిరుమల హిల్సుకు చెందిన అంజనాద్రి ధర్మసత్రంలో వో కాటేజి తీసుకుని— విషంత్రాగి ఆత్మహత్య చేసుకున్నారట తమ పొట్టో ఒకటి, వో ఉత్తరం పెట్టి తమ చావుకు ఎవరూ కారణం కాదని విశదీకరించారట వరుసకు వరుసకు అన్నాచెల్లెళ్లవుతారట అమర్ నాథ్ తల్లి చెల్లెలి కూతురట ఆ ఉషారాణి ●

---

## మనవి

**ఉత్తరాలు రాసేవారు**

* పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలనీ,
* వారి పేరు, పూర్తి చిరునామా కూడా రాయాలనీ,

మనవి చేసుకుంటున్నాము.

— సంపాదకుడు



# శవం

సి.జె.రాం

ఆవులిస్తూ కళ్ళు నలుపుకుని, ఓసారి ఒళ్ళు విరిచి తూర్పు దిక్కు చూసాడు నారాయణ

పుట్టి ఓ పావుగంటే అయినా తన ప్రతాపాన్ని ప్రదర్శించాలని ప్రయాస పడ్తున్న సూరీడు నెత్తురు ముద్దలాగే ఉన్నాడు!

'బ్యూటీక్వీన్'ముందు నిలబడి "ఉండలా? వెళ్ళిపోవాలా?" అనుకుంటూ మొహమాటంతో యిరకాటంలో పడ్డ 'గ్లామర్‌లెస్ సినీతార' లాగుంది సూరీడ్ని చూపిన గుడిసె ముందరి లాంతరు స్థితి!

"ఈ జీతగాళ్ళకు మరీ మతిమరుపెక్కువౌతున్నది!" అనుకుంటూ లాంతరు ఆర్పేశాడు నారాయణ

"ఇంత ప్రేమగా మమ్మల్ని పెంచి పెద్ద జేస్తున్నందుకు నీకు జోహారు" అంటూ పిల్లగాలులతో సందేశం పంపింది చెఱుకు పంట బావి పక్కనే తను పెంచిన ఓ పది రకాల గులాబీ మొక్కలు విరబూసి నవ్వుతున్నాయి! "మేమేం తక్కువా?" తళుక్కున మెరిసింది ప్రతి పంట!

తనివితీరా పంటను చూసుకొంటూ అలాగే కూర్చుని గుండెల నిండా ఉత్సాహాన్ని నింపుకుంటున్నాడు నారాయణ

అసలు తనకు చేనంటే ప్రాణం! ఇంటి దగ్గర మెత్తని పరుపులున్నా చింతమొంది జనాలున్నా తనకు చేలో పడుకోడమంటేనే వల్లమాలిన యిష్టం! పచ్చని పైరు మధ్యలో కుక్కిమంచంలో విరబూసిన వెన్నెల్లో ఆకాశాన్ని చూస్తూ ఊహాలోకాల్లో తేలిపోవడం అంటే తగని పిచ్చి! గుడిసె ప్రక్కనే ఉన్న బావిలో ఈదడం అంటే పడి చస్తాడు తను!! ఈ పిచ్చి తను చదువు మానేసిన తర్వాతే వచ్చింది! అసలు తను చదువు మానేయడమే చాలా మంచిదైంది. లేకపోతే ఈపాటికి బి ఏ కంప్లీట్ చేసి ఉద్యోగం వేటలో నలిగిపోయేవాడే

నారాయణ కూర్చున్న చోటు నుండి లేచి

ఓ వేప పుల్లను పళ్ల మధ్య పెట్టుకుని వరి పొలంలో పన్జేస్తున్న జీతగాళ్లను, పంటను తిలకిస్తున్నాడు

తను బి ఏ మూడవ సంవత్సరంలో చదువుకు, టౌనుకు 'గుడ్‌బై' కొట్టడం తను చేసిన మొదటి మంచి పని తను చదువుకు స్వస్తి చెప్పింది ఈ చేను గురించి కాదు, పంట గురించి అసలేకాదు! కేవలం తన పెళ్ళాం కొరకే! తను బి ఏ. రెండవ సంవత్సరం చదూతుండగానే పెళ్లి చేసేశారు ఇక అప్పట్నుండి సుందరస్వప్న లోకాలో విహరిస్తూ ఫైనలియర్ ప్రారంభంలోనే పారిపోయి వచ్చేశాడు తను!!

తను అలా వచ్చాక రెండునెల్లకే నాన్న చనిపోవడం, బాధ్యతలన్నీ తన తల మీద తాండవించడం!

వేపపుల్లను రెండుగా చీరి నాలుక శుభ్రం చేసుకుని, ప్రక్కనే ఉన్న కుండలోంచి నీళ్ళు తీసుకొని మొహం కడుక్కున్నాడు నారాయణ

సూరీడు పొడిచి ఓ రెండు గంటలౌతున్నది చేనంతా పర్యవేక్షిస్తున్నాడు రోజులాగే నారాయణ!

ఇద్దరు జీతగాళ్లు గట్టుపై కూర్చుండి అలసట తీర్చుకుంటున్నారు అంటే బీడీ తాగుతున్నారు వాళ్లిద్దరే తనకు రాత్రంతా ఈ చేల్లో తోడు! . గుడిసె ముందు, తను మంచంపైన, వాళిద్దరూ మంచానికిరు వైపుల బాడీగార్డ్స్‌లాగా పడుకుంటారు! .. వాళ్ల గుఱకలు తన ఊహాగానాలకు సంగీతాన్ని

# శ వం

సమకూరుస్తాయి పంటచేను ఆశాగానాలకు పల్లెపడచుల పాటలా! తనకు వెస్టర్న్ మ్యూజిక్ అంటే అసహ్యం, కాని వీళ్ల గుఱకలంటేనే యిష్టం!!

వాళ్లు గుప్పు గుప్పున పొగ వదుల్తున్నారు తను పొగత్రాగడు, తన ఈ మంచి గుణాన్ని చాలామంది మెచ్చుకోవడం తను విన్నాడు! తనను చాలామంది గొప్పగా చూసారు, తాను యింగ్లీష్ చదువు చదివి కూడా వ్యవసాయం చేస్తున్నాడట! అందుకట!!

అవును, ఈ ప్రత్తి పంటను చూస్తే ఆశ్చర్యం వేస్తోంది, ఓ నెల క్రితం మొగుడు చచ్చిన ముండలాగుంది ఓ మూడుసార్లు నీళ్లతడి యివ్వగానే పెళ్లి కూతురే అయింది! వాడెవడు? యిటే పరుగెత్తుకొస్తున్నాడు?

అరే, మావాడే, మా తమ్ముడే, రఘు! వాడికసలు చేనంటేనే పడదు; యిల్లు, బడే వాడి లోకం మరి యిలా రొప్పుతూ పరుగెత్తుకొసు న్నాడేంటి?

"ఓహో అర్థమయింది!" ముఖంలో వెలుగురేఖ భరతనాట్యమాడింది తన లక్ష్మికిది తొమ్మిదోనెల కదా! . అదే విశేషమై ఉంటుంది వీడు చిన్న పాపలంటే పడి చస్తాడు, అందుకే ఈ ఉరుకులు, పరుగులు!

"అన్నయ్యా!" రొప్పుతున్నాడు రఘు.

"ఏం, యేమైందిరా? యేమిటంత తొందర?"

"మరే, మన నాయనమ్మకి చాల సీరియస్‌గా వుందట, అందరూ పెదపెం చేస్తున్నారు!"

"ఆఁ అలాగా?" పరుగులాంటి నడకతో బయల్దేరారు యిద్దరు 'ఏంత ఉపద్రవం జరుగుతుందో? ఏమౌతుందో?' నారాయణ మనసు వికలమయింది అలా కావడానికి పెద్ద కారణమే ఉంది!

మరి తనింతవరకు కన్న కలలేంటి? జరగబోయేదేంటి? అహాయ ముందరి ప్రశాంతా?

అవును, తను నానమ్మ సంగతే మరచిపోయాడు, నాన్నమ్మ యింకా అత్తమ్మ ఊర్లోనే ఉంది మహా ఒండి ఘటం, తనన్నదేమాట తనిష్టప్రకారమే అందరూ నడుచుకోవాలి! అందుకే అమ్మకూ నాన్నమ్మకూ పడదు

నాన్న పోయాక ఆమెను చూసే నాథుడే లేడట! ప్రతిరోజూ యింట్లో తగవులే ఉండేది ప్రతిక్షణం భయంగా ఉండేది, ఏ క్షణంలో రణరంగం ప్రారంభమౌతుందో అని!

అందులో ఆమె తప్పు కూడా లేదేమో అనిపిస్తుంది తను యింట్లో పెద్ద కాబట్టి ఏపని జరుపదలచినా తనను సంప్రదించాలంటుంది ఏవో తనకు తోచిన సలహాలిస్తుంది, వాటిని గహిస్తే సంతోషిస్తుంది ఆమె కోరేది మాత్రం మా మంచే కదా! కాకపోతే కొంచ చాదస్తం మనిషి అది సహజమే కదా! వయసుతోపాటు చాదస్తం కూడా రావాలి అప్పుడే వయసు పైబడట్టు! తను యింత చదువు సంస్కారం తెలిసిన వాడైఉండి కూడా మొదట్లో యేమనకపోయినా తర్వాత తర్వాత ఆమెను కసురుకోడం, తిట్టుకోడం చేశాడు తలచుకుంటే తనపై తనకే అసహ్యం వేస్తోంది

నాన్నమ్మ తనను ఎంత గారాబంగా చూసేది చిన్నప్పుడు! అమ్మకు నాన్నకు తెలీకుండా డబ్బులివ్వడం, అడిగినవన్నీ కొనిపెట్టడం యింకా గుర్తున్నాయి తను ఎన్నితప్పులు చేసినా వెనకేసుకొచ్చి, అమ్మా నాన్నంనే కసురుకునేది!

తను స్కూలు ఎగ్గొట్టాలంటే నాన్నమ్మ కాళ్ళు పెనవేసుకోవాల్సిందే



బాల్యమంతా సినిమారీల్లా తిరిగింది నారాయణ మదిలో

అప్పటికీ యిప్పటికీ ఎంతతేడా! తనకోసం యేమైనా చేయగల నాన్నమ్మ చాదస్తపు మనిషైపోయింది తను ఎదిగిపోయాడు! విద్యాబుద్ధులు వచ్చాయి! అందమైన యిల్లాలూ వచ్చింది!! .. యిక నాన్నమ్మ అవసరం యేముంది? యిందుకేనా తను నాన్నమ్మను నిరక్ష్యం చేసింది

ఎండ కొంచెం తీవ్రమైంది నారాయణ ఒళ్ళు, మొహం చెమటతో నానుతోంది

తనకు చిన్నప్పటి ఓ సంఘటన బాగా గుర్తుంది! తను రెండోతరగతి చదూకున్న రోజులు! ఓ రోజు తెలుగు మాష్టారు పరమేశ్వరయ్య బడితె పూజ చేయడం! తన చేతుల వాయడం నీవు విమానం మోత మ్రోగడం జరుగుతోంది

ఈ వార్త యెలా తెల్సిందోగాని ఆ పీరియడ్ కాకముందే ప్రత్యక్షమైంది నాన్నమ్మ! తనకు ప్రాణం లేచిరావడం, నాన్నమ్మ చంకలో దూరడం, ఆమె తన తల నిమురుతూ హృదయానికి హత్తుకోవడం నాన్నమ్మ భద్రకాళి రూపం దాల్చి మాష్టారి నోట మాట రాకుండా చేయడం!! అప్పట్నుండి అతను యే విద్యార్థిని కొటక పోవడం! తన హృదయంలో వేసిన ముద్ర తాలూకు జ్ఞాపకాల్ని స్నేహితులతో ముచ్చటిస్తూ తను ఎంజాయ్ చేస్తుంటాడు! అలాంటి నాన్నమ్మకి సీరియస్‌గా ఉందా? .

తనకు అర్థం కాని విషయం ఒకటుంది నాన్నబతికి ఉన్నప్పుడు అమ్మా నాన్నమ్మ చాలా తక్కువసార్లు మాటా మాటా అంచుకునేవాళ్ళు! నాన్నను చూడగానే నోళ్లకు తాళాలు పడేవి కని నాన్నగారు పోయాక వీళ్ళిద్దరూ మితిమీరారు దానికి కారణం తాను మధ్యలో కల్పించుకుని సమాధాన పర్చకపోవడమా? .

గతస్మృతులు నారాయణ గుండెను పట్టి పిండుతున్నాయి దాని ఫలితంగా శరీరం చెమట కక్కుతోంది

ఓ మూడునెల్లక్రితం

ఓరోజు తను సాయంత్రం నాలుగ్గంటలకే చేలోంచి వచ్చాడు అప్పటికే యింట్లో కురుక్షేత్ర యుద్ధం ప్రారంభమైంది. తన భార్య లక్ష్మి వాళ్ళను సమాధాన పర్చడానికి ప్రయత్నిస్తూ యిద్దరి తిట్లకు గురౌతోంది! తననుచూసి ఆ రణరంగం కొంచెమైనా తగ్గుతుందేమో అనుకున్నాడు తను, కాని దానికి విరుద్ధంగా జరిగింది

"ఒరే నారాయణా! ఈ యింట్లో బ్రతకడం నావల్ల కాదురా తండ్రీ! ఐతే ఆదయినా ఉండాల, లేకపోతే నేనైనా ఉండాల! ఈ కొంపలో నా ప్రాణానికి ముప్పున్నదిరా నారాయణా" నాన్నమ్మ దాదాపు శోకం తీసింది తనకు చిర్రెత్తుకొచ్చింది, అరికాలు మంట నెత్తికెక్కింది "పెట్టినకూడు తింటూ ఓ మూలన పడుండక, నీకెందుకే అంతంత మాటలు!" కసురుకున్నాడు తను

అదే సమయంలో పెదపాలెంనుండి తన మేనత్త సీతామాలక్ష్మి, మామయ్య రామన్న గడపలో ప్రత్యక్షమయ్యారు. అత్తమ్మకు కొంచెం నోరు జాస్తి!

"అవున్రా, పడుంటదిరా దానికి కూడు గుడ్డా యేమీ అక్కర్లేదు, యింతయిసమిస్తే చాలు మీ పీడ ఎరగడౌతది! పిగ్గెట్టా లేక పోయిందిరా! తల్లి, కొడుకు, కోడలు కల్సి ముసల్దానొక్కదాన్నిజేసి పీక్కుతింటున్నారు. మీ నోళ్ళుపడ! మీ" తిట్ల పరంపరలు కురిపించింది

ఓ అరగంటసేపు శాపనార్థాలు, పాతగోతుల త్రవ్వకాలు దాదాపు పూర్తయినాయి! ఉభయపక్షాలు అలసిపోయారు తన చివరి నిర్ణయంగా అంది అత్త—

"నాతల్లి నాకు బరువనుకుంటున్నారేమో... నాతల్లికి నేను కూడెట్టుకుంటా... మీకాడ మాత్రం అది మూడుదినాల్లో పీనుగౌతది! . మీరు దాన్ని బతకనియ్యరు! ... మీకు లజ్జ, సిగ్గు యేమాత్రం లేవు నాతల్లిని నాయెంటనే తీసుకెళ్తా! . "

యిలా ఉరుములు ఉరిమి, తానెంత అడ్డగిస్తున్నా వినకుండా నాన్నమ్మను వాళ్ళు తీసుకెళ్ళిపోయారు

ఆ మరుసటిరోజునుండే అమ్మలక్కల సూటిపోటు మాటలకు యింటిల్లిపాది గురి కావడం జరిగింది

ఈ మూణ్ణెళ్ళలో తామగాని, అమ్మగాని ఒక్కసారైనా నాన్నమ్మ దగ్గరకు వెళ లేదు. కాని రఘు ఓ రెండు మూడుసార్లు వెళ్ళి వచ్చాడు తనతో మాత్రం అంతాబాగున్నారని చెప్పేవాడు

ఆ ఊరుకూడా అట్టే దూరంలేదు. కాలి నడకతో ఓ అరగంట త్రోవ బస్సుగాని లారీలుగాని నడవడం ప్రభుత్వానికి యిష్టం లేదేమో, రోడ్ వేయలేదు

తను మాత్రం చాలాసార్లు ఆ ఊరుకు వెళ్ళాలనుకున్నాడు, కాని ఎప్పటికప్పుడు పనుల ఒత్తిడి ఉన్నట్టనిపించడం వల్ల వాయిదా వేయడం జరిగింది కాని యిప్పుడు ఈ వార్త విన్న తర్వాత తన మనసులో ఎక్కడో ఓ అగ్ని గుండం రగిలింది హృదయం పశ్చాత్తాపంతో మూలుగుతోంది

నారాయణ, రఘు యిల్లు చేరుకున్నారు. మార్గ మధ్యంలో వాళు ఒక్కమాటైనా మాట్లాడుకోలేదు చివరి మనసులో వాళ్ళే



# శవం

ఆలోచనల పరంపరలను విదుల్చుకుంటూ బాధపడ్డారు.

ఇంట్లో దృశ్యం చూసి అవాక్కయిపోయాడు నారాయణ ఇల్లు నిండా జనం నిండి ఉన్నారు తను బంధువులనుకున్నవాళ్లు యేడ్పులు, పెడబొబ్బలు— పెడుతున్నారు

గడపదాటి లోపలి కడుగు పెట్టాడు నారాయణ అంతే అమాంతంగా తనను వాటేసుకుని, "మనకిక నాన్నమ్మ లేదురా నారాయణా!" అంటూ బావురుమంటున్న తన అక్క శశిని చూసి నిర్ఘాంతపోయాడు

తనింత ఘోరం జరుగుతుందనుకోలేదు! అలాగే కూర్చుండిపోయాడు నారాయణ. కళ్ళు నీళ్ళు చిమ్మటానికి సిద్ధంగా ఉన్నాయి కంఠం వణుకుతోంది, మాట పెగలడంలేదు!

ఓ ఐదారుగురు పెద్దమనుషులు అతని చుట్టూ చేరారు "పాపం శాంతమ్మ, ప్రాణం పోయేముందు 'నారాయణా, నారాయణా!' అంటూ కలవరించిందటనోయ్!" నారాయణ గుండెలోంచి రక్తాన్నంతా తోడాడో పెద్దమనిషి

'నన్ను నా యింటికే తీసుకుపొండి, నారాయణ చేతులమీదుగా నా దహనం జరగాలంటూ పదే పదే చెప్పిందట!" ఓ అమ్మ ఉవాచ

"ఆవిడ చెప్పకపోయినా, ఆ వూర్లో — అందులోను అల్లుని యింటికాడ ఎవరైనా దహన సంస్కారాలు జరుగనిస్తారా? అట్లా జరిగితే ఎంత సిగ్గుతక్కువతనం! వంశగౌరవం యేమైనా ఉంటుందా? అట్లా చేయడానికి వాళ్ళు తయారుగా ఉన్నారేమోకాని, మనం చూస్తూ చూస్తూ అంతటి అపచారం జరుగనిస్తామా? లే బాబు నారాయణా! తొరగా బయల్దేరదాం, శవాన్ని ఈడకు తెచ్చి నీ చేతులమీదుగా దహనం జరిపించాల! ఎట్లాగూ పోయిన వాళ్ళు రారు, వాళ్ళ ఆఖరి కోరికలైనా తీర్చకుంటే బాగుంటదీ?" జంగమయ్య అమనయించాడు

నారాయణకూడా అలాగే ఆలోచించాడు నాన్నమ్మ బ్రతుకున్నప్పుడు తాను సుఖపెట్టలేకపోయాడు తనంత దౌర్భాగ్యుడింకఉండడు! నాన్నమ్మ చివరి కోరికనైనా తప్పకుండా తీర్చాలి!

జీతగాణ్ని పిలిచి ఎడ్లబండి తీసుకొని పెదపాలెం రమ్మనిచెప్పి, తను ఓ ఐదారుగురు హితులు వెంట రాగా కాలినడకన బయలు దేరాడు నారాయణ

నాన్నమ్మను చూడాలి వలికే భాగ్యం తనకు లేకున్నా కనీసం శవాన్నైనా చూడాలి నాన్నమ్మకు తన యింటిదగ్గరే దహన క్రియలు జరపాలి!

ఎంతో వేగంగా ఆలోచిస్తున్నాడు. అయినాసరే సమయమే గడవడమే లేదు, కాలం ఆగిపోయినట్టుగా ఉంది!

సెకన్లు నిమిషాలు .. ఎంతలెక్క పెట్టినా గడవటమేలేదు

కాలాన్ని కున్న గొప్పశక్తి, అది మన అభిరుచికి వ్యతిరేకంగా నడుచుకోవడం!

అరగంట కంటె ముందుగానే పెదపాలెం చేరుకున్నారు

వాకిట్లో శవాన్ని చూసి అమాంతంగా మీద పడిపోయి కౌగిలించుకున్నాడు నారాయణ హృదయ భారాన్ని తీర్చుకునే ప్రయత్నంలో ఉన్నాడు!

చూసేవాళ్ళందరూ ఆశ్చర్యపోయారు, నంగనాచి వేషమన్నారు

సీతామాలక్ష్మి రుద్రకాళే అయింది—

"ఇన్నాళ్ళు నీకు నాన్నమ్మ గుర్తు రాలేదురా! దొంగముం ! పీనుగున్నాసి దుఃఖమొచ్చినాదా బాబూ, నీ యింట్లో ప్రతిరోజు సంపావు గదరా నా అమ్మని, అప్పుడు రాలేదురా దుఃఖం! యింకేమున్న దనొచ్చినవ్ పీనుగునైనా మిగలకుండా సేదామనా? ఒరే దొంగలమ్మి నీ దుంప దెగిపోను! నీ యింట దీపం లేకుండాగాను నా తల్లిని తాకకురో!" గొంతు చించుకుంటోంది సీతామాలక్ష్మి ఆ తిట్లకు అంతంలేదు. అలా సాగిపోతూనే ఉన్నాయి.

నారాయణలో ఓపిక స్థానాన్ని ఉద్రేకం ఉక్రోషం ఆక్రమించుకుంటున్నాయి. లేచి నిల్చున్నాడు!

కళ్ళు రెండూ ప్రొద్దుటి సూర్యగోళం లాగా నెత్తురు ముద్దలైనాయి

బండి కూడా వచ్చింది అప్పుడే!

"మామా! శవాన్ని తీసుకెళి మా యింటి దగ్గరే దహనక్రియలు జరిపిస్తాను!" నోరు పెగిలింది అతికష్టంమ్మీద

"ఏందిరో? ... ఒంటిమీద తెలివుండే మాట్లాడుతున్నావా? ... యిన్ని నెల్లు మా ఉప్పు తిన్నది, మా యింటికొచ్చే సచ్చింది, మా యిష్టప్రకారమే చేస్తం! బతికున్నప్పుడు గుర్తురాలేదు, యిప్పుడులోకం నీదుంప తెంపుతదని ఉరికొచ్చినావా? ... ముందు మర్యాదిగా నుంచి లేసి నీ బండెక్కి నీ ఊరెల్లిపో! . పిచ్చి పిచ్చికూతలు కూస్తే బాగుండదు జాగర్త!" రామన్న హెచ్చరిక చేశాడు

నారాయణ తల్లి, లక్ష్మి అంతా వింటూనే ఉన్నారు పిండమనిషి లక్ష్మి ఓ మూలన కూర్చుంది యేమీ తోచడంలేదు వాళ్ళకు!

'తను చదువుకున్నాడు, వాళ్ళు చదువులేక లోకజ్ఞానం లేక సంకుచితభావాలతో ప్రవర్తిస్తున్నారు' యివేవీగుర్తురాలేదు నారాయణకు. ఉద్రేకం, ఆగ్రహం, దెబ్బతిన్న ఆత్మాభిమానం కళ్ళలోంచి కురుస్తున్నాయి

"శవాన్ని నేను తీసుకెళ్తాను, ఎవడడ్డమొస్తాడో చూస్తాను!" మొండిధైర్యం చేశాడు నారాయణ

శవాన్ని రెండు చేతుల్లోకి తీసుకున్నాడు నారాయణ

ఒక్క ఉదుటున రామన్నలేచి శవాన్ని పట్టుకున్నాడు తనవైపు లాక్కుంటున్నాడు!

ఓ రెండు క్షణాలు

శవం యిద్దరి చేతుల్లో నలుగుతోంది!

ఆ గుంజులాటలో శవం శివమెత్తినట్టూగుతోంది!!

వీళ్ళ మూర్ఖత్వాన్ని అడ్డగించే సాహసం ఎవరూ చేయడంలేదు.

శవం దభీమంటూ క్రిందపడింది! ... వికృతాకారంలో పడింది

ప్రేక్షకులంతా ఒక్కసారిగా శవంచుట్టూ మూగారు!

నారాయణ ఆగ్రహం కట్టలు తెంచుకుంది! ... పిడికిలి బిగిసింది!! . రామన్న ఛాతీపైన పడింది!!

వెల్లకిలా పడిపోయాడు రామన్న. స్పృహ కోల్పోయాడు.

సీతామాలక్ష్మితో పాటు యింకొందరు స్త్రీల శాపనార్థాలతో, రోదనలతో ఆకాశం మార్మోగుతోంది!

పెద్దలింకా తేరుకోలేదు పాపం!

రామన్న కొడుకు సోమలింగం ఒక్క ఉదుటున రంగంలోకి దూకాడు కర్రతో! ..

కర్రపై చేతులు బిగుసుకున్నాయి! ... అలాగే పైకి లేచింది!!

వెలితిరిగిన కండరాల బలమంతా ప్రయోగించబడింది!!

గురి తప్పలేదు ... నారాయణ తల బ్రద్దలైంది!!

ఎర్రని వేడి రక్తం చిమ్మింది

తల నెత్తుటి మడుగులో గిజ గిజ లాడుతోంది యిందాకటి శివమెత్తిన శవంలా!

మూర్ఖత్వానికి హద్దులే కుండా పోతూన్నట్లే నారాయణ ప్రాణ వాయువులు కూడా హద్దుల్లేని అనంత విశ్వంలో లీనమైపోతున్నాయి!!





# వారఫలం

## 19–2–1982 శుక్రవారం మొదలు 25–2–1982 గురువారం వరకు

★మేషం : ఎలాంటి పరిస్థితులందైనా మీకు అపకారం జరుగదు వ్యాపార విస్తరణయందు మీకు అనుకూలవారమే విద్యావిషయంలో విద్యార్థులకు అనుకూలత,ఉద్యోగంలోనివారికి ప్రగతికనిపిస్తుంది స్త్రీలకు నూతనావకాశాలు, నూతన వస్తుసేకరణకు అవకాశమున్నది

★వృషభం : విజయవంతమైనవారం ఏ ప్రయత్నాలకు దిగినా మీకు అనుకూలతగలదు సభా గౌరవానికి, పత్రికా గౌరవానికి అవకాశంగలదు రాజకీయంగా కొందరకు ఏదో మేలుచేకూరనున్నది యత్నకార్యసిద్ధి, ధనలబ్ధి గలదని గ్రహించి మెలగండి స్త్రీలకు ఇంట జరుగనున్న శుభ కార్యాలోచనలు ఫలింపగలవు

★మిథునం సుఖశాంతులకు, ప్రశాంతంగా వారం గడుపుటకు, గృహాలంకరణ సామాగ్రి కొనుటకు, ఇతరుల సహాయం చేసేలాగు కనిపించుటవలన మీకు మేలు కనిపిస్తుంది స్త్రీలకు గౌరవప్రద పదవులు లభించటం, సభా గౌరవం లభ్యం కావటం, ఈ వార విశేషం

★కర్కాటకం ఆదాయం గల వారం తలంచిన కార్యమందు మీకు విజయం లభించగలదు దూర బంధువులు అనుకోకుండా యింటకి రాగలరు మిత్రుల సహకారం లభించే అవకాశంగలదు వ్యాపార విస్తరణయందు మీ ఆలోచనలు ఫలిస్తాయి స్త్రీలకు వస్తుసేకరణకు, ధనాదాయానికి, ఉద్యోగంలో ప్రమోషన్ లభించుటకు అవకాశమున్నది

★సింహం ధనాదాయం గల వారం వ్యాపారంలో మీకు అనుకూలత సంభవించుటకు, వృత్తిలో ప్రగతి సాధనకు, అవకాశమున్నది వ్యాపారంలో నూతన ప్రయత్నాలకు దిగగలగటం కూడ విశేషమే బంధు సహాయం ఈ వారం ఎలాంటి పరిస్థితులలో మీరు ఆశింపతగదు స్త్రీలకు గౌరవం, ఆదాయం, ఉద్యోగ భివృద్ధి చేకూరేవారం

★కన్య సమయానికి మేలు చేయగలమని వారు తప్పుకొంటారు ఉద్యోగమందు ఎంత జాగ్రత్త వహిస్తే అంత మేలు జరుగబోతున్నవారం రాజకీయ వాదలకు యత్నలోపంలేకుంటే, మేలు జరుగనున్నది కుటుంబ కలతలుంటాయేమో గ్రహించి మెలగండి స్త్రీలకు అభిమానుల వలన మేలు, అధికారులవలన ఆదరణ లభ్యమని గ్రహించాలి

★తుల ఆలోచనలు చేయవల్సి ఉంటాయి ఒక్క అంగుళం కూడా ముందుకు పోయే మార్గం కనిపించదు పనులు జరగక పోవుటచేత వేదన ఎక్కువవుతుంది ఆందోళన కనిపిస్తుంది ఎక్కువ ఖర్చుకు అవకాశాలు లేకపోలేదు లక్షలివ్వటం, అవి వసూలు చేసుకోలేకపోవడం పనికిరావు కోవాలి స్త్రీలకు అనారోగ్యం, ఉపయోగంలేని మాటలు,తిరగుడులతోనే కాలంవ్యయమవుతుంది

★వృశ్చికం నాలకాంతంగా సౌమ్యంగ, విజయవంతంగా, యిదివరకు వదలిన మీ కార్యాలు రచనావ్యాసంగాన, వ్యాపార మూలకంగా నెరవేర్చుకోగలగుతారు 'ఇది ఉన్నది లేదు' అనే బుద్ధి లేకండ కలం వ్రాయించగలరు నూతన వ్యాపారాల జోలికి పోవటానికి భయపడుతారు మరేం భయంలేదు స్త్రీలకు రాజకీయంగా, ఆర్థికంగా సామాజికపరంగా బాగుండేవారం

★ధనుస్సు : 'డబ్బుగల వారని' దగ్గర చేరుతారు కొందరు. ఇచ్చినఅప్పును గూర్చి వత్తిడి చేయవద్దని కొందరు ఆశ్రయిస్తారు విధివిరామం లేకుండా,లాభదాయకమైన పనుల వల్లడి కొందరకు ఏర్పడే అవకాశమున్నది తప్పకుండా పుస్తకాలలో ఎక్కువ లాభం లబ్ధి పొంద చూడండి స్త్రీలకు ఆర్థికంగా ఉద్యోగ వృత్తులందు ప్రగతి సూచక వారమే

★మకరం అన్ని హంగులు సమకూరుతాయి ధైర్యంచేసి చాల విలువగల వస్తువులు సేకరించటం వ్యాపారంలో మంచి ఆదాయం పొందటం, చేసే వృత్తిలో ప్రగతి సాధనకు యత్నించటం, మొండి పట్టుదలతో మానసులు సాధించుకోవటానికి అవకాశం ఏర్పడుతుంది స్త్రీలకు వృత్తి విద్యాయోగ్యతలకు నూతన వృత్తిని చేపట్టుటకు కొందరకు అవకాశాలున్నాయి

★కుంభం సకల విధాల శ్రేయోదాయకమైన వారం ఏదో సకుతో శ్రద్ధ చేయక, కార్యరంగానికి దిగితే మీకు లాభదాయకమే అని గ్రహించండి చిత్ర నిర్మాణ దిగేవారికి, కళారంగంలో ఖ్యాతి సంపాదింపదలచే వారికి మేలైనవారం స్త్రీలకు సుఖ శాంతులు, నూతన విషయగ్రహణానికి అనువైన వారం

★మీనం శుక్ర, శనివారాలలో అనుకోకుండా ఏవో చిక్కులు తటస్థపడనున్నవి దాయాదుల వలన కొందరకు, శత్రువర్గీయుల వలన కొందరకు అనానుకూలత సంభవం దైవకార్య నిర్వహణానికి యత్నించండి అదేగా మీ చిరకాల వాంఛ! స్త్రీలకు ఉన్నత స్థాయికి పోయే మార్గం, ప్రతిభ రాణించే విధానం కనిపిస్తుంది గాయనీ గాయకులకు నూతనావకాశాలుంటాయి గ్రహించండి

విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



# ఆంధ్రపత్రిక

## శ్రీ దుందుభి నామ సంవత్సర
## పూర్ణ శాస్త్రీయ పంచాంగమ్

శ్రీ కాంచీ కామకోటి పీఠ సంస్థానాస్థాన సిద్ధాన్తులగు

దైవజ్ఞ చిన్తామణి శ్రీ పిడపర్తి చిన కృష్ణమూర్తి శాస్త్రి, భాషా ప్రవీణ

శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణింపబడినది.

ఇందు తిథి నక్షత్రములు ఘటికలలోను గంటలలోనూ కూడా చూపబడినవి శుభముహూర్తములు, దుర్ముహూర్తములు వర్జ్యములు, మహాపాతలు గంటలలోనూ కూడా చూపబడినవి యోగకరణ, అమృత, గ్రహ ప్రవేశములు ఘటికలలో చూపబడినవి భారత ప్రభుత్వము నియమించిన కాలెండరు రిఫారమ్ కమిటీవారి నిర్ణయమునను సరించి ప్రకటింపబడిన ఇండియన్ ఎఫిమెరిస్ అండ్ నాటికల్ అల్మనాకు సరిపడునట్లు చూపబడినది నూతన వేధశాలలయందు కనుగొనబడిన భూ కేంద్రమునకు సరిపడు వాస్తవిక రవిచంద్రులచే సాధించబడిన తిథ్యాదికము, గ్రహ సంచారము చూపబడినవి ఈ తిథ్యాది గ్రహ సంచారములే పంచాంగమున వ్రాసినట్లు ఆకాశమున సరిపడుచున్నవి.

నిరాయణస్ఫుట గ్రహములు ఇండియన్ స్టాండర్డు టయిమును అనుసరించి గం 5—29 ని॥లకు చూపబడినవి దేశాంతర పట్టికలు మరియు 10 అక్షాంశా లగాయతు 30 అక్షాంశవరకు లగ్న ప్రమాణములు ఇవ్వబడినవి

వర్ష యోగములు, గోచార ఫలములు ఆనందాది యోగములు, వాస్తు ప్రకరణము, ఆంధ్రప్రదేశ్, భారతదేశముల భౌగోళ్యములు, మొదలైన విషయములు ఇవ్వబడినవి.

త్వరలో వెలువడనున్న ఆంధ్రపత్రిక పంచాంగము

ప్రతి యింట తప్పక వుండదగినది.

**ముందుగా మీ కాపీకై మా ఏజంటుకు చెప్పియుంచండి.**

**లేదా మా కార్యాలయంకు వ్రాయండి.**

**విడిప్రతి వెల రు. 3-00**

**రిజిష్టర్డు బుక్ పోస్టులో రు. 5-65**

## ఆంధ్ర పత్రిక

గాంధీనగరం, విజయవాడ – 3

బషీర్ బాగ్, హైదరాబాద్ – 29.




**ఎస్. ఎల్ పి – గుంటూరు**

స్త్రీకిఅత్యంత ముఖ్యమైన 'ప్రెగ్నెన్సీ పిరియడ్'లో తీసుకొనవలసిన జాగ్రత్తలు గురించి వివరముగా తెలుపకోరు తాను నెలతప్పిన మొదటి నుండి ప్రాథమికమైన 1, 2, 3, 4 నెలలలో ఏయే జాగ్రత్తలు తీసుకోవాలి ? బాధలేమైనా ఉన్నవా ? తరువాత దశలలో ఏటువంటి జాగ్రత్తలు తీసుకోవాలి ప్రాథమికముగా తీసుకొనవలసిన చర్యలు, ఆహారము మందులు ఏమిటి ? డాక్టర్ నుండి ఎప్పుడెప్పుడు ఏ రకమైన ట్రీట్‌మెంట్ తీసుకోవాలి ?

ప్రతినెలా బరువు, బ్లడ్ ప్రెషర్ నెత్తురులోని హిమోగ్లోబిన, మూత్ర పరిశోధనలు చేయించుకోవటం అవసరం

5, 6 నెలల తర్వాత కాళ్లవాపు ఉన్నదీ లేనిదీ పరీక్షింప చేసుకోవాలి పాలు, పండ్లు, ఆకుకూరలు ఎక్కువగా తీసుకోవాలి

మామూలు దైనందిన చర్యలను కొనసాగించటం, మానసిక ఉల్లాసం కలిగించుకోవటం అవసరం ప్రతినెలా డాక్టరుచేత పరిశోధింప చేసుకోవటం చాలా అవసరం

**టిఎస్ ఎన్ పి. – పొన్నూరు**

నా వయస్సు 18 సం లు నాకు మెన్సెస్ అయినపుడు విపరీతంగా కడుపునొప్పి వస్తుంది ఈ నెప్పి 2 సంవత్సరములుగా వస్తోంది ఇలా రావటానికి కారణమేమిటి ? తగ్గాలంటే ఏ మందులు వాడాలి ?

దీనిని స్పాస్మోడిక్ డిస్మెనోరియా అని అంటారు. గర్భసంచి ద్వారం గర్భవతులు కాని స్త్రీలలో చిన్నదిగా ఉండటం సహజం బుతుస్రావం వచ్చినప్పుడు ఉండే రక్తస్రావం మామూలుగా బహిర్గతం అవకపోవటం ఈ మార్గావరోధం వల్ల జరుగుతుంది తద్వారా కడుపునొప్పి రావటం జరుగుతుంది

నెప్పి తగ్గటానికి ఆస్పిరిన్ మాత్రలు వాడటం, అరుదుగా ఆంటీస్పాస్మోడిక్ మాత్రలు వాడటం మాత్రమే ఈ లక్షణం ఉన్నవారికి చేయతగిన చికిత్స

**కె యన్ – కొయ్యూరు**

నాకు వివాహమై అంటే 12 సం లు అయినది పెళ్లిఅయిన తర్వాత సంవత్సరములో అబ్బాయి 9 నెలలు పూర్తిఅయిన తరువాత డెలివరీ అయిన రోజున పుట్టిపోయాడు తరువాత 3సం లకు 7వ నెలలో అమ్మాయిపుట్టి అదేరోజునపోయినది మరల 2 సం తర్వాత అబ్బాయి పుట్టి 7వ నెలలో పోయాడు ఇది జరిగి 5 సం లు అయినది మరలా నాకు ఇంతవరకూ సంతానం కలగలేదు దీనికి మీ సలహా కోరుతున్నాను.

మీరు ఇరువురు నెత్తుర పరీక్ష (విడిఆర్ ఎల్) బ్లడ్ గ్రూపు (ఆర్ హెచ్ ఫాక్టర్‌తో సహా) చేయించుకోవటం అవసరం ఆ పరీక్ష ఫలితాల ననుసరించి చికిత్స చేయించుకోవలసి ఉంటుంది

**ఎస్. విల్ ఎన్ – హైదరాబాదు**

నా వయస్సు 21 సంవత్సరములు గతరెండు సంవత్సరములుగా సిగరెట్ కాల్చటం అలవాటు అయినది నా పెదవులు నల్లగా మారినవి యీ నలుపు పోవాలంటే ఏమి చెయ్యాలి ?

సిగరెట్లు కాల్చటంవల్ల ఏర్పడే పెదిమలనలుపు దాదాపు నిరంతరంగా ఉంటుంది పూర్తిగా సిగరెట్లుమానిన వారికి కొద్దిగా తేడా కనబడవచ్చును.

**కె వి డి – గుంటూరు**

నాకు మూడునెలల నుండి బాగాజలుబు చేసి తుమ్ములు వచ్చుచున్నవి రోజుకి 6 సార్లయినా తుమ్ముతుంటాను ముక్కులోపల దురదగా వుంటుంది మొహమంతాకూడా దురదగావుంటుంది దీనికి నివారణ ఏమిటి ? జలుబు తగ్గటానికి ఇంజక్షనలు వుంటే తెలుపండి ?

దురద, తుమ్ములు ఒకేసారి రావటం వల్ల ఇవి అలర్జీవల్ల వస్తున్నాయని తెలుస్తున్నది

గాలిలో ఉండే దుమ్ము మొదలయిన వాటివల్ల ఈ అలర్జీ ఏర్పడే అవకాశం ఉన్నది దుమ్ము దరిచేరని సమయాలలో ఆ ప్రాంతాలలో ఉండకపోవటంవల్ల కొంతవరకు నివారించుకోవచ్చును పెద్ద ఆస్పత్రులలో "అలర్జీ క్లినిక్" అనే విభాగాలు ఉంటాయి ఆ క్లినిక్‌లలో కొన్ని పరీక్షలు చేసి ఆ అలర్జెన్లకి విరుగుడు ఉపాయం చెప్పటం జరుగుతుంది

**జి విల్ – భీమవరం**

నా వయస్సు 22 సంవత్సరములు 12 సంలుగా నాకు అలర్జీ ఉన్నది ఏమాత్రం, దుమ్ము, ఘాళి తగిలినా విపరీతంగా తుమ్ములు వస్తాయి దీని నివారణ ఏమిటి ? ఈ ఎలర్జీ అంటు వ్యాధా ? అంటు వ్యాధి అయితే చిన్న పిల్లలకు త్వరగా అంటుకుంటుందా ? పెద్దవారికి అంటుకుంటుందా ?

అలర్జీ అంటువ్యాధి కానేకాదు అందువల్ల చిన్నపిల్లలకిగాని పెద్దవారికిగాని అంటుకొనే ప్రశ్న రాదు ఈ అలర్జీ ఉన్నవారు అలర్జీ క్లినిక్‌లలో చూపించుకోవలసి ఉంటుంది



300 గ్రాములు
రూ 3·20
(స్థానిక పన్నులు అదనం)

మీకు మీరుగాగమనించండి!

# ఇతర డిటర్జెంట్ ఉతికే బిళ్ళ లకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ. ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

# టోటల్

## నీలి డిటర్జెంట్ ఉతికే బార్




## మొదటి "నిజమైన" డిటర్జెంట్ బార్!

టోటల్ - ఉతికే బార్ రీతిలో ఉన్నది
మరియు అధికమైన శుభ్రపరిచే నీలి
డిటర్జెంట్ శక్తి ఉన్నది
మరి ఇంకేమి? పొదుపుగ
ఉతికేందుకుగాను ఇది ఐదు చేతికనువైన
భాగాలు కలిగివుంది

## కేవలం కొద్దిపైసల హెచ్చుకే రెండు రెట్లు బరువు!

ఒక నిర్దిష్టమయిన డిటర్జెంట్ కేక్ 125 గ్రాముల బరువు
కలదానికి మీరు ఎంత ఖర్చుపెడుతున్నారు?
250 గ్రాముల టోటల్ ధర కేవలం రూ 2 67
(300 గ్రాములకి రూ 3 20) అదీను మామూలు డిటర్జెంట్ కేక్‌లకన్న
రెండు రెట్లు బరువు ఎక్కువ కేవలం కొద్ది పైసల హెచ్చుకే!




ఉతుకుటకు
చేతికనువుగా
ఐదు భాగాలు

## ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియుతమిళనాడులలో దొరుకును

---

కర్ణాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్ బెంగుళూరు వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన
మార్కెట్ చేయువారు మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్ బెంగుళూరు

MCA TDB 51 Tel



సీరియల్

(గత సంచిక తరువాయి)

ఇలాటి వాదోపవాదాలు మరో ఏడెనిమిది జరిగాక కళ్యాణిని సీతారామయ్యకిచ్చి పెళ్ళి చేయటానికి ఒప్పుకుంది సత్యవతి

సీతారామయ్య వెంకటరత్నమంతటి విప్లవ నాయకుడు కాకపోయినా పార్టీలోనే తిరుగుతున్నాడు! అతనిక్కూడా ఆ సిద్ధాంతాలు బాగా ఒంటబట్టాయి! అలాటి పార్టీ సీతారామయ్య ఒక ప్రముఖ నాయకుడయిన వెంకటరత్నం చెల్లెల్ని పెళ్ళి చేసుకుంటున్నాడు అనే వార్త అత్యంత వేగంగా పాకిపోయింది

ఆ పెళ్ళికి చాలామంది పెద్దపెద్ద నాయకులు వచ్చారు! వెంకటరత్నం ఊహకు మించి రావటంతో అతనికి గుండెల నిండుగా గాలి పీల్చుకోవటానిక్కూడా తీరిక లేకుండాపోయింది ఆ సమయంలో అతను పది చేతులూ, పది కాళ్ళూ ఉన్నవాడిలా అన్నిచోట్లా తానే అయి, అందరకూ అన్నీ అమర్చి, ఎవరకూ ఏ లోటూ రాకుండా చూసి, అందరి దృష్టిలోనూ మరోసారి మరచిపోలేనంతటి అపురూప వ్యక్తిగా నిలిచిపోయాడు!

*　　*　　*

కళ్యాణి గుడివాడ వెళ్ళిపోయింది

వెనుక వరండాలో కూర్చుని దమయంతి క్రొత్త పుస్తకాలకు అట్టలు వేసుకుంటున్నది

గిరిజ, సత్యవతమ్మ మంచంపై కూర్చుని కాఫీ తాగుతున్నారు తార కత్తిపీట ముందరేసుకుని బెండకాయలు తరుగుతున్నది

చరచరా పాకుతూ దమయంతి దగ్గరకు వచ్చింది స్వప్న

"స్వప్నా! నా పుస్తకాలు చింపావో-చూడు, ఏన్నేం చేస్తానో!"

దమయంతి అనేదేమిటో తనకు అర్థం అయినట్లే నోరంతా తెరచి నవ్వింది స్వప్న!

చటుక్కున లేచి స్వప్నను అమాంతం పైకెత్తి గట్టిగా ముద్దు పెట్టుకుంది దమయంతి

"మన స్వప్న గొప్ప అందాలరాశి అవుతుంది వొదినా"

చిన్నగా నవ్వింది తార

ఖాళీగ్లాసు క్రింద పెట్టి "నా బంగారుకొండా! ఇట్లా రావే తల్లీ" చేతులు చాపింది సత్యవతి

వెంకటరత్నం లోపలకు వచ్చాడు

"స్వప్నా!" అప్పటివరకూ నాయనమ్మ చేతుల్లో ఆడుకుంటూన్న స్వప్న తండ్రిని చూడగానే క్రిందికి దిగటానికి ప్రయత్నిస్తూ "ఆఁ - ఊఁ" అంటూ ఏవేవో కబుర్లు చెప్పేయటం ప్రారంభించింది

మల్లెపూవులాగా ఉన్న తెల్లని ఫ్రాకులో స్వచ్ఛమైన గులాబీలా ఉన్న కూతురివంకా, తన చేతులవంకా ఒకసారి చూసుకుని "నా చేతులంతా మట్టిరా నాన్నా, నేను స్నానంచేసి వస్తాను" అని చెప్పి గదిలోపలకు వెళ్తూ వెళ్తూ ఆగి, తారవంక చూసి "తారా! నేను స్నానంచేసి వచ్చేసరికి నాకు మంచి కాఫీ కావాలోయ్" అన్నాడు

వెంకటరత్నం స్నానానికి వెళ్ళాడు

దమయంతి లేచి గదిలోకి వెళ్ళి వెంకటరత్నం కూర్చునే పడక్కుర్చీ తెచ్చి బయటవేసింది

బెండకాయముక్కల గిన్నె, కత్తిపీట తీసుకు తార లోపలకు వెళ్ళింది

స్వప్నను ఒడిలో కూర్చోబెట్టుకుని సత్యవతమ్మ చెబుతూన్న కబుర్లు వింటూ వెంకటరత్నం కాఫీ త్రాగుతున్నాడు

"తారా! నీకింకా వంటపని కాలేదా?"

"అయిపోయిందండీ, ఇదిగో ఐదు నిమిషాల్లో వచ్చేస్తున్నా," గంజి వార్చుతూ జవాబిచ్చింది

స్వప్న వెంకటరత్నం జుట్టుతో ఆడుకుంటున్నాది వెంకట్ దమయంతి పుస్తకాలు తిరగేస్తున్నాడు

వెంకటేశ్వర్రావూ, మూజెల్ల సీతారామయ్యా కలిసి వెనుక గేట్లోనుంచీ లోపలకు వచ్చారు 'మూజెల్ల సీతారామయ్య' అని సత్యవతే పేరు పెట్టింది కళ్యాణి భర్త పేరు కూడా అదే అయ్యేసరికి ఇతడి పేరు ఆ విధంగా మార్చేసింది ఇహ అందరకూ అదే అలవాటయిపోయింది వెంకటేశ్వర్రావు స్వప్నను ఎత్తుకుని వంటగదిలో కెళ్ళాడు

"ఇక్కడ అస్సలు గాలి ఆడటం లేదయ్యా! స్వప్నకు దగ్గు వస్తుందేమో! బయటకు పద! నేనిపుడే వచ్చేస్తున్నాను అయిపోయింది పని అంటూనే "దమయంతీ!" అని పిల్చింది

"ఏమిటొదినా?"

"ఇలారామ్మా!"

"వస్తున్నా ఏమిటొదినా?"

"దమయంతీ! ఆ డబ్బాలోంచీ కొబ్బరి బూరెలు, పకోడీలు తీసి వాళ్ళకు పట్టుకెళ్ళు"

దమయంతి ప్లేట్లు తుడిచి వదిన చెప్పిన పని చేస్తున్నాది

తార పప్పుచారుకు తాలింపు వేసి, కూరను గిన్నెలోకి తీసింది నేతి గిన్నెను అన్నం కుండమీద పెట్టింది దాలిమీద ఉన్న పాలకుండపై ఓరగా మూకుడు వేసి బయటకు వచ్చింది

చేతులు కడుక్కుని మూడు గ్లాసులతోనూ మంచినీళ్ళు తీసుకొచ్చి వాళ్ళ ముందర పెట్టింది

వరండా గట్టుమీద కూర్చుంటూ "స్వప్నా! నువ్విలా రా రా!" పిల్చింది

'దమయంతీ! నేను కూడా వేసిపెట్టనా?'

"అయిపోయాయొదినా! ఇంక రెండే ఉన్నాయి! నేను వేసేసుకుంటానులే"

సీతారామయ్య అమ్మమ్మ సత్యవతమ్మకు మేనమామ భార్య అందువల్ల సీతారామయ్య కన్పిస్తే సత్యవతికి పుట్టింటికి వెళ్ళినంత సంతోషం! ఏవేవో కబుర్లు తరచితరచి అడిగి మరీ చెప్పించుకుంటుంది

మాటలమధ్యలో అప్పుడే గబుక్కున గుర్తొచ్చిన వాడిలా అన్నాడు వెంకటరత్నం —"అమ్మా! నన్ను గుడ్లవల్లేరు ఫిర్కాకు కార్యదర్శిగా నియమించారమ్మా"

వినగానే సత్యవతమ్మకు అర్థంకాలేదు తారకూ చప్పున అర్థం కాలేదు

"అంటే ఏమిట్రా?"

**జరిగిన కథ—10** రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ—రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం శ్రీనివాసరావ్‌తో కలసి ప్రసాద్ పెళ్ళికి వెళిన వెంకటరత్నం మదిలో 'అనుకోని సంఘటన' ద్వారా ముద్రవేసుకొంటుంది తార ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార భర్తపైన ఉండే గౌరవంకొద్దీ అతను పంపే ఉత్తరాలతోపాటు పార్టీ పుస్తకాలు కూడా చదువుతూ ఆనాటి రాజకీయాలను అవగతం చేసుకొంటుంది తార బెజవాడలో జరగబోతున్న మీటింగులకి వెళ్దాం రమ్మని తారకు ఉత్తరం ద్వారా తెల్పుతాడు వెంకటరత్నం తండ్రి వెళ్ళొద్దని వారించినా వినక ఎన్నో బాధలకోర్చి అతన్ని కలుసుకొంది తార రాఘవయ్య నిరాదరణతో వెంకట్ వెంట వచ్చిన తార అత్తగారింటి పరిస్థితుల్ని అవగాహన చేసుకుంటుంది ఆలుడి ద్వారా తార గర్భవతి అని తెలుసుకొన్న రాఘవయ్యగారు ఆనందభరితులై, రెండు మూడు రోజుల్లో వచ్చి చూస్తానని చెబుతారు పురిటికి పుట్టింటికి వెళ్తుంది తార కూతురి పేరు స్వప్న' అని పెట్టుకొంటాడు వెంకట్ చదువు కోసం గుడివాడ వెళ్లిన కళ్యాణి పార్టీలో పనిచేసే సీతారామయ్యని ప్రేమించి అతన్నే పెళ్లి చేసుకొంటానని ఖచ్చితంగా ఇంట్లో చెప్తుంది సత్యవతమ్మ గొడవచేస్తుంది

ఆవిడకు అర్థమయ్యేలా చెప్పేసరికి వెంకటరత్నానికి సగం ఓపిక చచ్చిపోయింది మిగిలిన సగం ఓపికతోను గుడ్లవల్లేరు వెళ్ళటానికి ఆమెను ఒప్పించగలిగాడు

ఆ రాత్రి తార వెంకటరత్నం దగ్గర పెద్ద పేచీ పెట్టింది

''నేనూ గుడ్లవల్లేరు వస్తాను'' మొదట వెంకటరత్నం అభ్యంతరం చెప్పాడు

''అక్కడ నువ్వుండలేవు''

''నేనుండగలను''

''అమ్మా, నాన్నా ఒప్పుకోరు''

''నేను ఒప్పిస్తాను''

''స్వప్న ఉండలేదు''

''బ్రహ్మాండంగా ఉంటుంది''

''నువ్వుత్త మొండిదానివి''

''అవును! నేను జగమొండిని''

చటుక్కున దగ్గరకు లాక్కుని ఆమె నడుం చుట్టూ చేతులు వేసి గట్టిగా బంధించాడు వెంకట్

''నొప్పి'' సన్నగా అన్నది

''ఎక్కడ?'' ఖంగారుగా అడిగాడు

''మనస్సులో'' చిన్నగా నవ్వింది.

ఇంకాస్త దగ్గరకు లాక్కున్నాడు వెంకట్.

''ఎందువల్ల?'' గుసగుసగా అడిగాడు.

''దాని యజమాని దాన్ని వదిలేసి ఎటో వెళ్ళిపోతారట''

మధురంగా నవ్వాడు వెంకట్ అతనికి అతి సమీపంగా ఉన్న ఆమె అధరంపై మృదువుగా పంటిగాటు వేశాడు

''నిన్నొదిలి నేను మాత్రం ఉండగలనా?'' గారంగా అన్నాడు

ఆ మాట, ఆ పలికిన తీరు — తారకు గిలిగింతలు పెట్టినట్లయింది ఎంతో ఉత్సాహంగా, మరెంతో సంతోషంగా, అతనిపై కొండంత ప్రేమతో, లాలనతో, కోరికతో అతని బిగికౌగిలిలో — నవ వధువులా ఒదిగిపోయింది తార

*     *     *

నాలుగయిదు రోజులు ఏ విశేషమూ లేకుండా జరిగిపోయాయి

ఆ సాయంత్రం త్వరగా వంటపని ముగించుకుంది తార

స్నానం కూడా చేసింది జడవేసుకుంటూ గది బయటకు వచ్చింది

దమయంతి ఏదో వ్రాసుకుంటున్నాది స్వప్న అక్కడే కూర్చుని బొమ్మలతో ఆడుకుంటున్నాది.

సత్యవతమ్మ గిరిజకు తలదువ్వి జడవేస్తున్నాది.

''అత్తయ్యా!'' నెమ్మదిగా పిల్చింది.

''ఏమిటి?'' అన్నట్లుగా తలత్రిప్పి చూసింది సత్యవతి.

''ఆయనతోపాటు నేను కూడా వెళ్తానత్తయ్యా!''

''ఎక్కడికి?'' ఆశ్చర్యంగా ప్రశ్నించింది

''గుడ్లవల్లేరు' తటపటాయిస్తూ చెప్పింది తార

''వాడేదో పార్టీ పనిమీద వెళ్తున్నానన్నాడు కదా!''

''అవునత్తయ్యా! కానీ, ఆయన ఒక్కరే అక్కడ ఎలా ఉంటారు?''

''పసిపిల్లతో క్రొత్తచోట నువ్వెట్లా ఉంటావు!'' తార ఎట్లా ఉంటుంది అనే సమస్య కన్నా, తార వెళ్ళిపోతే ఇంట్లో ఎట్లా అనేది పెద్ద సమస్య!

''ఫర్వాలేదత్తయ్య! నేనెక్కడైనా సర్దుకుపోగలను''

సత్యవతమ్మ గిరుక్కున తల తిప్పి తార



ముఖంలోకి చూసింది 'మరో మార్గం' అన్నట్లుగా 'స్వప్నను వదిలి మేమెట్లా ఉండగలమే ?'' అంది

''ఎంత దూరం అత్తయ్యా, ప్రక్క స్టేషనే కదా ! రెండు మూడు రోజులకోమారు మీరూ, మామగారూ వస్తూండవచ్చు, నేనూ స్వప్న ను తీసుకుని వస్తుంటాను '' స్థిరంగా అన్నది తార

సత్యవతమ్మ ఏ వంక పెట్టినా దానికి మార్గం చూపిస్తూ 'నేను వెళ్ళాల్సిందే' అన్నట్లుగా మాట్లాడుతూన్న తారకు చాలాసేపు ఏవేవో భయాలు కూడా చూపెట్టబోయింది

తార వేటినీ పట్టించుకోలేదు

దీపాలన్నీ వెలిగించి అన్ని గదుల్లోనూ పెట్టింది

ఈమధ్యనే స్వప్నకు రెండోపూట అన్నం పెడుతున్నాది అందుకని కుండ మధ్యలోంచి అన్నం తీసి, గిన్నెలో వేసి, మెత్తగా పిసికింది కొంచెం ఉసిరికాయ పచ్చడి, నేయి వేసి కలిపి తీసుకొచ్చింది పీట వేసి కూర్చోబెడితే బొమ్మలాగా కూర్చుని, ఏ పేచీలూ పెట్టకుండా చక్కగా తింటుంది స్వప్న

'పెద్దదానికి పురుడొస్తే నా ఒక్కదానివల్లా ఎట్లా జరుగుతుందే ?'' కాస్త తీవ్రంగానే అడిగింది

''ఆ సమయానికి నేనూ వస్తానత్తయ్యా ''

''మాటకు మాట జవాబు చెప్పటమే కానీ ప్రయాణం మాత్రం మానుకోవన్నమాట '' ఈసారి ఇంకాస్త తీవ్రంగా అన్నది

తార జవాబు చెప్పలేదు

లోపలికి వెళ్ళి అన్నంలో పప్పుచారు పోసి కలుపుతూ బయటకు వచ్చింది

గిరిజ, సత్యవతమ్మ నెమ్మదిగా ఏదో మాట్లాడుకుంటున్నారు

తారకు వినిపించటమూ లేదు ! వినాలని ఆమెకు కుతూహలమూ లేదు ! స్వప్నకు చిన్న చిన్న మాటలు చెబుతూ అన్నం తినిపించుతోంది

దమయంతి చూపులు పుస్తకంలో ఉన్నా, చెవులు మాత్రం అమ్మ మాటలు వినాలనే ప్రయత్నం చేస్తున్నది

తార లోపలకు వెళ్ళి కాస్త పెరుగువేసి, ఉప్పు, ఒకముక్క నీళ్ళు పోసి కలిపి తెచ్చింది

''వాడు తీసుకెళ్తా నంటున్నాడా ? నువ్వే వెళ్తానంటున్నావా ?''

తార జవాబు చెప్పలేదు

స్వప్నకు తినిపించటం అయిపోయాక మూతి కడిగి మళ్ళీ చాపపై కూర్చోబెట్టింది

గిన్నె కడిగి, పీట ఎత్తి లోపలవేసి బయటకు వచ్చింది

గట్టుమీద కూర్చుంటూ, ప్రక్కనే ఉన్న దమయంతి పుస్తకం చేతిలోకి తీసుకుంది

''వాడిని అడిగావా ? రమ్మన్నాడా ?'' మరలా అడిగింది సత్యవతమ్మ ఈసారి ఆమె ప్రశ్నలో కుతూహలం తొంగి చూస్తున్నది

దానికీ తార జవాబు చెప్పలేదు

''వాడే రమ్మన్నాడా ?'' మళ్ళీ రెట్టించింది సత్యవతమ్మ

అపుడూ తార బదులు పలకలేదు అసలు

## తార

పుస్తకంలోంచి తల ఎత్తలేదు తన జీవితానికి సంబంధించిన అతి ముఖ్యమయిన విషయమేదో అందులో ఉన్నట్లుగా జాగ్రత్తగా పుస్తకంలోకి చూస్తూండిపోయింది

''వాడు రమ్మని ఉండడు ! నువ్వే బయలుదేరి ఉంటావు !'' అన్నది నిష్ఠూరంగా

''అందులో తప్పేమి ఉందత్తయ్యా ! ఎందుకలా అన్నిసార్లు రెట్టిస్తారు ! ఆయన ఉన్న చోటే కదా నేను వుండాల్సింది ! ఆనాడు రాముడు అడవులకు వెళ్తూంటే సీతకూడా వెంబడి వెళ్ళిందా, లేదా ! అలాగే ఆయన వెంబడి నేనూ వెళ్తాను !'' నెమ్మదిగానే చెప్పినా, తార మాటల్లో ఎటువంటి తడబాటూ లేదు పైగా తను ఒక నిర్ణయానికి వచ్చేసినట్లూ, ఇంక దానికి తిరుగులేదు అన్నట్లూ వినిపించుతోంది

సత్యవతమ్మ, గిరిజ, దమయంతి — అందరూ తార మాటలకు నిర్ఘాంతపోయారు

వాళ్ళు ఆశ్చర్యంలోంచి తేరుకోకుండానే వెంకట్రామయ్యగారూ, వెంకటరత్నమూ కాస్త

> ## మహాత్ములూ అంతే !
>
> సూర్యుడుదయిస్తూనే
> సహస్రకోటి జతల కళ్ళను వెలిగిస్తాడు
> అస్తమిస్తూనే -
> అనంతకోటి తారకాగణాల్ని వెలిగిస్తాడు
> మహాత్ములూ అంతే !
>
> - గన్ను కృష్ణమూర్తి

అటూ ఇటూగా వచ్చేసారు ఆ వెనుకే అల్లుడు కూడా వచ్చాడు

వెంకట్ స్నానంచేసి వచ్చేలోపున తార పీటలు వేసి, కంచాలు పెట్టి, మంచినీళ్ళు పెట్టి అన్నీ అమర్చింది

'అత్తయ్యా, వడ్డించండి '' అంది వంట గదిలోనుండి బయటకు వచ్చేస్తూ

''ఇవ్వాల్టికి నువ్వే పెట్టేసెయ్యవే '' అంది కూర్చున్న చోటునుండి లేవకుండా

తార అన్నీ ప్లేట్లలో సర్దింది ఇంతలో వెంకటరత్నం వీపుపై తడి అద్దుకుంటూ బాత్ రూమ్‌నుండి గదివైపుకు వెళ్ళటం చూసింది తార వెంటనే దమయంతిని పిలిచి ''నాన్నగార్నీ, బావగార్నీ భోజనానికి రమ్మని చెప్పమ్మా'' అన్నది

ముగ్గురూ భోజనాలు చేస్తున్నారు తార ఒక వారగా నిలబడి ఎవరికి ఏం కావాలో గమనిస్తున్నది

గత రెండు మూడు రోజులుగా బాగా వర్షాలు పడ్డాయి ఈరోజుకూడా వర్షం వస్తుందో ఏమో— ఒకటే ఉక్కగా ఉన్నది ఎక్కడా గాలి అనేది ఉన్నట్లే లేదు

వేడివేడి అన్నం, కోడిగుడ్ల పొరటు, వడియాలు, నేతిబీరకాయ పచ్చడి పప్పుచారు — రుచికరమయిన భోజనం ! కానీ—గాలిలేమి, ఉక్కదనంవల్ల ఎంతో చిరాకుగా ఉన్నది

'మగవాడు కాళ్ళతడి ఆరేలోపున భోజనం ముగించాలి !' అంటారు పెద్దలు అదేమాదిరిగా వెంకట్ చాలా త్వరగా భోజనం చేసేస్తాడు అతడు బయటికొచ్చి తొట్టిదగ్గర చేయి కడుక్కుంటూండగా సత్యవతమ్మ అన్నది —

''ఈ విషయం విన్నారా ?'' ఆవిడ అలా అన్నది అంటే అది భర్తనుద్దేశించి అనటం అన్నమాట !

వెంకట్రామయ్యగారు ఆవిడకేమీ బదులు చెప్పకుండా కోడలి నుద్దేశించి 'పెరుగు'' అన్నారు కొంచెం అన్నం పెట్టి, ఉప్పు వేసి, పెరుగు వేసింది

''కోడలు కూడా గుడ్లవల్లేరు వెళ్తుందట '' మళ్ళీ అన్నది సత్యవతమ్మ

వెంకట్రామయ్యగారు అపుడూ ఏమీ బదులు చెప్పకుండా, పీటమీంచి లేచి బయటకు వచ్చారు

సత్యవతి కాస్త బిగ్గరగానూ, మరికాస్త నిష్ఠూరంగానూ అన్నది —

''చెప్పేది వినపడుతోందా ?''

''అయితే — ఏమంటావు ?'' అప్పటికి నిమ్మగా అడిగారాయన

''ఆనాడు రాములవారి వెంబడి సీతమ్మవారు అడవులకు వెళ్ళినట్లుగా, కొడుకుతోపాటు కోడలు కూడా గుడ్లవల్లేరు వెళ్తుందట '' దీర్ఘాలుతీస్తూ చెప్పింది సత్యవతి

వరండాలో నిలబడి ఉన్న వెంకట్ చటుక్కున తలతిప్పి వంట గదివైపు చూసాడు

గొంతుకుక్కూర్చుని ఎంగిలి కంచాలు తీస్తూన్న తారకూడా చటుక్కున తలతిప్పి వెంకట్‌వైపు చూసింది

లాంతరు వెల్తురులో తార కళ్ళల్లోకి చివ్వున చిమ్మిన కన్నీరు మెరుస్తూ వెంకట్‌కు స్పష్టంగా కన్పించింది

తల్లి మూర్ఖత్వం అతనికి క్రొత్తకాదు ! మాటంతో మార్పులేనిదని కూడా అతనికి తెలుసు ?

అతనికి ఎవరితోనయినాసరే గొడవలు పెట్టుకోవటమంటే ఇష్టం ఉండదు ! అందులోనూ తల్లితో గొడవ - సుతరామూ నచ్చని విషయం !

స్టేజిపైన నిలబడి అతను చెప్పే ఉపన్యాసాలు— ఒక్కోసారి కొంతమందికి పదునైన బాకుతో గుండెలను చీలుస్తున్నట్లుంటాయి !

ధనవంతులతో అతను చేసే వాదనలు—వాళ్ళను నిలువెత్తుమంటలలో వేసి కాలుస్తున్నట్లుంటాయి!

కానీ — అవి — అది వేరు ! ఇది వేరు !

అందుకే తల్లినిగానీ, చెల్లెళ్ళనుగానీ మార్చటానికి ప్రయత్నించడు మొదట్లో వాళ్ళను మార్చాలని ఎన్నో ప్రయత్నాలు చేసాడు కానీ, వాళ్ళు మారరు అని ఖచ్చితంగా తెలుసుకున్నాక వాళ్ళను ఒక పరిధిలో ఉంచటానికి ప్రయత్నించాడు అప్పట్నుంచీ వెంకట్ అంటే ఆ యింట్లో ఒక విధమైన భయం ! అతను ఎపుడూ ఏమీ అనడు అంటే మాత్రం అవతలివాళ్ళు గడగడా వణికిపోయేట్లు ఛడామడా తిట్టి మరీ అవతలకు వెళ్ళిపోతాడు ఇవ్వాళకూడా అదే జరిగింది తల్లితో వాదన అతనికి ఇష్టంలేదు ! వేయదలచుకున్న

గప్‌చిప్‌గ చేసేయటమేగానీ – 'ఇదిగో నేనీ పని చేస్తున్నానోహో' అని చాటుకోవటం అతనికి ఎంత మాత్రమూ నచ్చని విషయం! అందుకే అతను గదిలోకి వెళ్ళిపోయాడు

వెంకట్రామయ్యగారు కూడా చెప్పులేసుకుని బయటకు వెళ్ళిపోయారు

"ఈ మాయదారి గొడవలోపడి పిల్లకు అన్నం పెట్టటంకూడా మర్చిపోయాను" అంటూ లేవలేక లేస్తూ, ఆయాసపడుతూ వంట గది కొచ్చింది సత్యవతి

అప్పటికే అందరకూ కంచాలూ, మంచినీళ్ళూ అన్నీ అమర్చింది "దమయంతీ, గిరిజా రండమ్మా"

ఇన్ని రోజులుగా కాదు — కాదు ఇన్ని సంవత్సరాలుగా లేని ధైర్యమేదో తారలో సడెన్‌గా ప్రవేశించినట్లుంది చకచకా భోజనం చేసి, ఖాళీ గిన్నెలు ప్రక్కన పెట్టేసింది పాలకుండలో మజ్జిగ చుక్క వేసి బీరువాలో పెట్టేసింది

వాళ్ళ భోజనాలు ఇంకా పూర్తికాలేదు "దమయంతీ! మీ భోజనమయ్యాక కంచాలూ, గిన్నెలూ ప్రక్కన పెట్టేసెయ్యమ్మా" అని చెప్పి గదిలోకి వెళ్ళిపోయింది

ఆశ్చర్యంగా చూసింది సత్యవతి మూతిని మూడు వంకర్లు త్రిప్పింది గిరిజ

రోజూ అయితే తన భోజనం ఎంత త్వరగా అయిపోయినా అందరి భోజనాలూ అయ్యేవరకూ అక్కడే ఉండేది ఆ తర్వాత వంటగది అంతా సర్ది తాళం వేసేది అందరకూ మంచినీళ్ళ చెంబులు పెట్టేది! దాదాపు అందరూ నిద్రపోయాక, మరో మారు తలుపులన్నీచూసి అప్పుడు గదిలోకి వెళ్ళేది!

అప్పటికి వెంకట్ కళ్ళనిండా నిదుర నింపుకుని భార్యకోసం ఎదురుచూస్తూ ఉండేవాడు "ఇప్పటికి గుర్తొచ్చానా?" అనేవాడు నవ్వుతూ

అలాటి తార ఏ పనులూ చేయకుండా, మంచి నీళ్ళ చెంబు ఎట్టుకుని, గదిలోకి వెళ్ళి తలుపు వేస్తుంటే ఆమె తెగింపుకూ, ఆమె ధోరణకూ బయటి సత్యవతే కాకుండా లోపలి వెంకట్‌కూడా అమితంగా ఆశ్చర్యపోయాడు

"ఏమిటోయ్! ఈరోజు ఏదో పెద్ద తుఫాను వచ్చేటట్లుంది ఈ సమయంలో నువ్వు నా దగ్గరకు' వెంకట్ మాటలు పూర్తికాకుండానే తార మృదువైన చేయి అతని నోటికి అడ్డం వెళ్ళింది

'ఇపుడు జరుగుతోన్న తుఫానులు చాలటం లేదా అయ్యగారికి?"

ఎడంచేత్తో ఆమెని తన దగ్గరగా కూర్చోబెట్టుకుని, కుడిచేత్తో తన నోటిపైన ఉన్న ఆమె చేతినిపైకి ఎత్తాడు

"తారా!" మృదు గంభీరమైన అతని కంఠం తార మదిలో ఇందాకటి నుండీ సుడి తిరుగుతూన్న వేదనను సన్నగా తాకింది ఫలితంగా అందమైన ఆమె కన్నులు తడి అయ్యాయి

రెండు చేతులతోటీ ఆమె తలనుపట్టి, ముందరకు వంచి నుదుటిపై ఆప్యాయంగా ముద్దుంచాడు

తార అలాగే ఇంకొంచెం ముందరకు వంగి అతని గుండెలపై తల ఆన్చుకుంది రెండు చేతులతోనూ ఆమెను చుట్టి ఊరడింపుగా, మెల్లగా తట్టాడు

తార కళ్ళు ఆమె అనుమతి కోసం ఆగకుండా, మనసులోని బాధనంతా కన్నీళ్ళ రూపంలో బయటకు వదిలేస్తున్నాయి!

ఆ తడి వెంకట్ గుండెలకు తెలుస్తూనే ఉంది!

మెల్లగా, అనునయంగా పిలిచాడు

"తారా!"

మరో రెండు నిమిషాలకు తన చేతుల్లో ఒణుకుతూన్న శరీరం స్థిరత్వాన్ని పొందటం వెంకట్ గ్రహించాడు

మరునిమిషం తార తలపైకి లేచింది కన్నీళ్ళ మధ్య పెదవులు బిగపట్టి చిన్నగా నవ్వింది మంకెన పూవుల్లాగా ఉన్న ఆమె కళ్ళవంక చూస్తుంటే వెంకట్ మనసు ఆర్ద్రమయింది!

చేయెత్తి తడితో మెరుస్తూన్న ఆమె బుగ్గలు తుడిచాడు వెంకట్ ఆ చేతిని తన రెండు చేతుల మధ్యా పట్టుకుని "నన్ను తీసుకెళ్తారు కదూ!" అడిగింది ఆమె కంఠం ఇంకా వణుకుతూనే ఉంది

"ధైర్యంగా ఉండు తారా నా నిర్ణయంలో ఏ మార్పూ ఉండదు చూడూ – అమ్మతో గొడవ పడి ఆమెని ఇప్పటికిప్పుడు మార్చగలమా చెప్పు? తప్పు కానంతవరకూ మనం దేనికీ భయపడనవసరం లేదు ఇవ్వాళ కాకపోతే రేపయినా వాళ్ళ తెలుసుకుంటారు నిన్నూ, స్వప్నమూ తప్పకుండా తీసుకెళ్తాను"

ఆమె మనసు ఎంతో తేలిక అయింది మబ్బులు విడిన ఆకాశంలా నిర్మలమయిన మనస్సుతో వెన్నెల లాటి చిరునవ్వు మనోహరంగా నవ్వింది

ఉల్లిపాయ రంగు వాయిల్ చీర, నలుపు జాకెట్, ఎర్రబారిన తడి కళ్ళూ, కందిన చెంపలూ, పలుచని పెదవులూ, చిట్టి గడ్డమూ – అత్యద్భుతంగా ఉన్నది తార

ఆప్యాయంగా దగ్గరకు లాక్కుని అపురూపంగా గుండెలకు హత్తుకున్నాడు వెంకట్

* * *

సత్యవతి సూటిగా తిట్టే తిట్లుగానీ, ఆడపడుచు చేసే హేళనలుగానీ తారను ఆపలేకపోయాయి

చివరకు కోపంగా, గంటు పెట్టుకున్న ముఖంతో అన్నది సత్యవతి – "ఒక్క గిన్నెగానీ, ఒక్క బిందెగానీ – ఏమీ ఇవ్వను అక్కడికెళ్ళి ఎలా కాపురం చేస్తావో – చెయ్యి!"

అప్పటికీ భయపడలేదు తార

వెంకటరత్నం తారతో కలిసి గుడ్లవల్లేరులో అడుగుపెట్టాడు గుడ్లవల్లేరు వెంకట్‌కు క్రొత్త కాదు! అతనికి కుడిభుజంలాంటివాళ్ళూ, ప్రాణ మిత్రులూ, పార్టీ సభ్యులూ, తెలిసినవాళ్ళూ ఎంతో మంది ఉన్నారు

కానీ – భార్యనూ, కూతుర్నీ ఎవరింట్లో ఉంచుతాడు!

అచ్యుతరామయ్యగారి భార్య ధనలక్ష్మి తారను ఎంతో ఆదరంగా లోపలకు తేసుకువెళ్ళింది సజల నేత్రాలతో లోపలకు అడుగుపెట్టింది తార

మొదటిసారి అత్తవారింటికి వచ్చినపుడుగానీ పుట్టింటికి వెళ్ళినపుడుగానీ లభించని ఆహ్వానం, సాంత్వన ముక్కూ మొహం తెలియని ఒక అపరిచిత వ్యక్తి అందించ కలిగింది

అందుకే వంగి ఆమె కాళ్ళకు నమస్కారం చేసింది

'అరే! అదేమిటమ్మా?" ఖంగారుగా తెల్లబోయినట్లుగా అన్నది ధనలక్ష్మి

"అందరకూ వ్యతిరేకంగా ఆయనతో కలిసి ఇలా











బులుసు వేంకటరమణయ్య

# కాల నియమం పాటించాలి

మనదేశంలో కాల నియమాన్ని పాటించక పోవడం ఒక పరిపాటి అయింది. అయిదున్నర గంటలకు మీటింగని ఆహ్వాన పత్రికలు పంచిపెడితే ఆరు గంటలకుగాని సభ్యులు సభాస్థలానికి రారు. అధ్యక్షులు, ఉపన్యాసకులు మరొక అర గంటకుకాని సభా వేదికను అలంకరించరు. ఈ సంప్రదాయం "ఇండియన్ పంక్చ్యుయాలిటీ" అని పేరు తెచ్చుకున్నది. ఒక్కొక్కప్పుడు రావలసినవారు రాకపోవడం, మంత్రులు మున్నగు పెద్దల కోసం గంటల తరబడి కాచుకొనియుండి నిరుత్సాహం పొందడం జరుగుతూనే ఉంటుంది.

ఒకవేళ తగిన సమయంలోనే సభాధ్యక్షులు ఉపన్యాసకులు వచ్చినా సాధారణంగా సమయ పరిపాలన జరగదు. మొత్తం సభా కార్యక్రమం రెండు గంటలు అని ప్రకటించినా, నాలుగు గంటలు పడుతుంది. తక్కువ పక్షంలో చూచుకున్నా మూడు గంటలకు తగ్గదు. దీని వల్ల శ్రోతలకు చాలా ఇబ్బందులు కలుగుతూ ఉంటాయి. కొంచెం దూర ప్రదేశాల నుండ వచ్చేవారు తిరిగి తమ నివాసం చేరుకొనుటకు చాలా శ్రమ పడుతూ ఉంటారు. సమావేశాలకు పోవలెనవే ఆసక్తి వుండినా నిరుత్సాహం ఏర్పడి, యికమీద సభలకు పోకూడదనే భావం కలుగుతుంది. సమయాన్ని పాటించకపోతే సదస్యులకు విసుగు కల్గుతుంది.

సభకు ఒక కార్యక్రమాన్ని నిర్ణయించి నప్పుడు నియమిత కాలపరిమితిలో సర్వము పూర్తికావాలి. అప్పుడే వినేవారికి విసుగుపుట్టదు.

కొందరు కాల పరిమితిని పాటించక తమ ప్రతిభను వెల్లడిస్తూ, ఏదో మాట్లాడుతూ బోరు కొట్టిస్తారు. అందువల్ల తక్కినవారి మంచి మాటలకు అవకాశం లేకుండా పోతుంది.

ఒకప్పుడు వరల్డ్ టీచర్ ట్రస్టు సంస్థాపకులు మహనీయులు కులపతి మాస్టర్ ఇ. కె. గారు ఒక మహాసభలో ఉపన్యసించడానికి గ్రామాంతరం వెళ్లవలసివచ్చింది. సభాధ్యక్షులు తమ ప్రతిభను వెల్లడిస్తూ, కొంది నిమిషాలలో ముగించవలసిన తమ తొలిపలుకులను రెండు గంటలకు పైగా పొడిగించారు. ఆ మాటలతోనే సభ్యులందరూ విసిగిపోయారు. ఆ తర్వాత అధ్యక్షులు "ఇకపైన శ్రీ ఇ. కె. గారు ఉపన్యసిస్తారు" అని, ఉపన్యాసం పావుగంటలో ముగించాలని కోరారట! పరిస్థితులు గమనించిన మాస్టరుగారు తమ ఉపన్యాసం మరియొకప్పుడు వినవచ్చునంటూ వేదిక దిగిపోయారట!

కాలనియమాన్ని పాటిస్తే ఇట్టి సంఘటనలకు అవకాశం ఉండదు. ★

## తార

వచ్చాను. ఈ బాటలో ఏ ఒడిదుడుకులు ఎదురైనా ఎంత కష్టమొచ్చినా ధైర్యంగా నిలబడేట్లు ఆశీర్వదించక్కా."

"లేమ్మా. నీ మంచితనమే నీకు రక్ష!" అన్నది.

తననెంతో ఆదరంగా దగ్గరకు పిల్చిన ఆమెను పరాయి వ్యక్తిగా భావించలేకపోయింది. అందుకే ఎంతో పరిచయమున్నదానిలా చొరవగా 'అక్కా' అని సంబోధించింది తార.

ఆరోజు, ఆ మరురోజు కూడా వాళ్ళ ఇంట్లోనే ఉండిపోయారు.

మరునాటిరోజు సాయంత్రానికి చెరువుగట్టుకు దగ్గరగా ఒక ఇల్లు సంపాదించాడు వెంకట్.

ఆ యింటి యజమాని పేరు కైలాసం! చూడటానికి మంచివాడిలాగే ఉన్నాడు. నెలకు 4 రూపాయలు అద్దె! కైలాసంతోచెప్పి ఆ ఇంటిని శుభ్రం చేయించి, తారను తీసుకొచ్చి ఇంట్లో వదిలేసాడు.

'కుటుంబాన్ని ఎంత త్వరగా సెటిల్ చేస్తే అంత త్వరగా పార్టీ పనులు చూసుకోవచ్చు' ననేది అతని ఆత్రుత.

గది మధ్యలో పెట్టె పుచ్చుకుని నించున్న తార ఫక్కున నవ్వింది.

"ఏమిటి, అలా నవ్వుతావు?"

"నవ్వక ఏంచేయమంటారు. గది దొరికింది బాగానే ఉంది! మరి వండుకోవటానికి నాలుగు పాత్రలూ, కాస్త పచారీ సరుకులూ, పొయ్యీ."

వెంకటరత్నం తలవెనుక చేత్తో రాసుకుంటూ 'అరరే. అవన్నీ మర్చిపోయాను తారా," అన్నాడు.

"అక్కయ్య రేపు వెళ్ళొచ్చులే అంటున్నా వినకుండా లాక్కువచ్చారు. ఇపుడేం చేయమంటారో చెప్పండి."

"సరే! కాసేపట్లో అన్నీ తెచ్చిపెడతానుండు." మళ్ళీ బయటకు వెళ్ళిపోయాడు.

గంగాధరరావు ఆడితీ నుండి కట్టెపుల్లలు వచ్చాయి!

కోట రంగారావు కోమటి కొట్టునుండి పచారీ సరకులు వచ్చాయి!

అతని అన్నగారి కొట్టునుండి అల్యూమినియం పాత్రలు వచ్చాయి!

ఏదో సామెత చెప్పినట్లుగా — అంతటి నాయకుడు వెంకటరత్నం తమ పార్టీకు సెక్రటరీగా రావటమే మహాభాగ్యంగా భావిస్తున్న ఆ ఊరిలో అతనికి లోటేమిటి!

తార నోరు తెరచి 'ఇది కావాలి' అని అడగటమే ఆలస్యం — క్షణాల్లో అమరిపోతున్నాయి. వారి ఆదరణ చూస్తుంటే తారకు ఎంతో ఆనందంగా ఉన్నది. తన భర్తకు ఉన్న పేరు, పలుకుబడి చూస్తుంటే గర్వంగా కూడా ఉన్నది.

అతడిపై ఆమెలో ప్రేమా, గౌరవమూ, భక్తిభావము రెట్టింపుగా పెరిగిపోయాయి!

అసలే తారకు పూజలు చేసే అలవాటు చాలా తక్కువ! ఇపుడిక ఆమె గుండె ఒక కోవెలగా — ఆ ఆలయంలోని దేవుడు వెంకట్‌గా స్థిరపడిపోయింది! ఆమెకు వేరే ఎక్కడో దేవుడు ఉన్నాడని అనిపించదు!

ఆమె మనసా, వాచా, కర్మ — అంతా వెంకట్!

ఆమె జీవితం — వెంకట్!
ఆమె ఆలోచన — వెంకట్!
ఆమె ఊహలు — వెంకట్!
ఆమె ఊపిరి — వెంకట్!

తారలాంటి ప్రేమమూర్తిని, అమృతమయిని పొందిన వెంకట్ నిజంగా అదృష్టవంతుడు!

వెంకటరత్నంలాంటి అపురూపమయిన, అసాధారణమయిన, అద్భుతమయిన, మహోన్నతమయిన వ్యక్తి జీవితంలో భాగం పంచుకోగలిగిన తార — ఎంత ధన్యజీవి!!

(ఇంకా వుంది)

# "కేర్‌ఫ్రీ రక్షణ –దానిలా మరొకటి లేదిక!"

మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన శుభ్రతతో కూడిన ఆ సంరక్షణని యిస్తుంచిది

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది దీని లోపల భాగంలో గల మెత్తని పొరలు ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ మీకు మరింతగా రక్షణని యిస్తుంది అయినా యిది ఎంతో సన్నగా సున్నితంగా యిమిడికగా ఉంటుంది

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది

కేవలం కేర్‌ఫ్రీలోనే క్రింది భాగం చుట్టురా నేప్కిన్‌కి



రెండు వైపులా గల 3 వైపుల గల నీలి ప్లాస్టిక్ కవచం మధ్యన అడ్డుగా నిలవడం కోసం ఉంది అందుకే యిది తడిసి పోతుందని గాని మరకలు పడుతుందని గాని భయం లేదు

ఎంతో సౌకర్యం మరెంతో వీలు

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది దీన్ని వాడటం పారెయ్యడం ఎంతో తేలిక దీన్ని ఫ్లష్ చేసెయ్యండి అంతే మార్చుకోవడం కూడా వీలు మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా ఎంతో సౌకర్యంగా ఉంటారిక అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండదు మీరిక ఏం చెయ్యదలుచుకున్నా చేఫికరుగా చేయగలరు మరి ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ।

ఇది 10 మరియు 20 నేప్కిన్స్ ప్యాక్‌లలో దొరుకుతుంది




Johnson & Johnson*



## కేర్‌ఫ్రీ*–కాలం మారుతూన్న యీ రోజుల్లో పూర్తి రక్షణ.




# నాణేనికి మరో వైపు

జి. విజి

''రోశమ్మ—సర్టిఫైడ్‌మిడ్‌వైఫ్''అనేపాతబోర్డు ఆ వీధి చివరన ఓ పెంకుటింటి ముందు గాలికి ఇటుఅటు ఊగటం ఆ రోడ్డంట వెళ్లేవాళ్ళు చాలాకాలంగా చూస్తున్నారు ఆమోద ముద్ర పడిన మంత్రసాని గనుక కొన్ని ప్రత్యేకమైన కేసులను కూడా ఆమె జయప్రదంగా నిర్వహించగలదని — డబ్బున్నవారికి, సినిమా స్టార్లకు, ప్రమాదవశాత్తు గర్భం ధరించిన అభాగినులకు తెలుసు

ఆ సాయంత్రం ఆరుదాటింది ఒక సైకిల్ రిక్షా మెల్లగావచ్చి, ఒక్క కుదుపున ఆ ఇంటి ముందాగింది అందులోంచి ఆయాసపడుతూ ఓ యువతి దిగింది చామన ఛాయ ఒకప్పుడు ఆకర్షణీయమైన కళ్ళేమో ఇప్పుడు లోతుకుపోయి ఉన్నాయి ముఖం పాలిపోయి ఉంది రిక్షాను ఎంపం చేశాక ఆమె ప్రయాసతో ఆ ఇంటి కాలింగ్‌బెల్ మీట నొక్కింది

కాస్సేపటికి ఓరగా తెరిచిన తలుపుల మధ్య ఓ నడివయస్కురాలు కనిపించింది ఆమె దృష్టి తొలుతే తన కడుపు వంక మరలడంతో ఆమే రోశమ్మ అయిఉండాలను అనుకుందా యువతి

''లోపలికి రామ్మా!'' ఆప్యాయత కనబరుస్తూ ఆహ్వానించడం రోశమ్మకు మామూలు

ఆ యువతి గాలిలో అంగలు వేస్తున్నట్లు లోపలికి నడిచి, రోశమ్మ చూపించిన ఓ పాత కుర్చీలో ఉస్సూరుమంటూ కూర్చుంది

''అందర్నీ అడిగే మొదటి ప్రశ్నే నిన్నూ అడుగుతున్నాను అంతగా నాదగ్గరికి రావలసిన అవసరం ఏమొచ్చిందమ్మా ?'' ఓ ముక్కాలి పీటను దగ్గరగా లాక్కొని కూర్చుంటూ రోశమ్మ అడిగింది

''అవసరమే బాగా ఆలోచించే నేనో నిర్ణయానికి వచ్చాను ఎక్కడలేని ధైర్యాన్నీ కూడ గట్టుకొని ఇప్పుడిలా మీ దగ్గరికి వస్తున్నాను ఇంత కాలం నా దురదృష్టాన్ని గోప్యంగా ఉంచడానికి ఎన్ని యాతనలు పడానో — ఇప్పుడు తలుచుకుంటే నాకే ఎంతో ఆశ్చర్యంగా ఉంది'' అని బాధగా నిశ్వాస వదుల్తూ, ''నా కడుపులో పెరుగుతూన్న నలుసు నాకు మాయని మచ్చ కాకూడదండి,'' అందా యువతి

''ఓ ఈ విషయం మీ తల్లిగారికి తెలుసా ?''

''అమ్మ ఎప్పుడో పోయింది ఆమె ఉంటే, ఇంతవరకు వచ్చేదికాదు ''

''నాన్న ?''

''ఉన్నారు ఆయనకు నేనీ పిడుగులాంటి వార్త తెలియజేయాలంటే — ఒకే ఒక మార్గముంది ఓ ఉత్తరం ముక్క అది ఆయన కళ్ళబడేసరికి నేనాయనకు కనిపించను, ఆయనా నాకు కనిపించరు నాన్నకు బాగా వయసు మీరింది ఒకప్పుడు ఎంతో గౌరవంగా బతికిన మనిషి నాకెంతో స్వేచ్ఛ ఇచ్చారు అదే నను చేసిన పొరబాటని తెలిస్తే, ఆయనిక ఈ భూమ్మీద ఉంటారా ?''

''మరి, ఆ పుట్టబోయే బిడ్డ తండ్రి?''

''బిడ్డ '' ఆ యువతి పెదవులు కంపించాయి కళ్ళుమూసుకుంది తెరిచేసరికికనుకొలకులలో నీటి బిందువులు నిలిచాయి ''వారు ఉంటే, ఈ అవస్థ ఎందుకు ? నన్ను పెళ్ళాడే ఉండేవారు నా దురదృష్టం — నేను నెల తప్పానని తెలిసిన మర్నాడే వారీలోకంనుంచి వెళ్లిపోయారు ''

''అరెరే ! ఎంతకాలమైంది ?''

''నాలుగు నెలల క్రితం ''

''అప్పుడే నా దగ్గరికి వచ్చి ఉంటే, ఎంత బాగుండేది ?''

ఆ యువతి కాస్సేపాగి జవాబిచ్చింది ''అప్పుడు దిక్కుతోచని స్థితిలో ఉన్నాను ఆ తర్వాత నాలో చెలరేగిన అంతర్యుద్ధానికి నా మెదడు డొల్ల అయిపోయింది అలా చీకట్లో విలవిలా తన్నుకుంటూన్న నన్ను వసంత ఓదార్చి, మీ అడ్రస్ ఇచ్చింది '

'ఆమెకు నేనెలా తెలును ? ఎవరా వసంత ? నా దగ్గరెప్పుడైనా కాన్పు చేయించుకుందా ?''

''తెలీదు ''

''ఇంతకీ, నీ పేరేమిటో చెప్పావు కాదు ''

''గిరిజ,'' అందా యువతి కళ్ళు తుడుచుకుంటూ

''చూడమ్మా, గిరిజా ! తొందరపడి ఈ నిర్ణయానికి వచ్చావేమో !''

''ఆలస్యంగా వచ్చాను ''

''కాని, నా దగ్గరికి ఆలస్యంగా వచ్చావు గనుకే, నీ మచ్చను తొలగించుకోబోతే — నీ నిండు ప్రాణానికే ముప్పు సంభవించే ప్రమాదముంది ''

''నన్ను మీరు గట్టెక్కించకపోతే, అంత పని జరుగుతుందేమో !''

''పిచ్చిదానా !''

''ఎంత డబ్బడిగినా ఇస్తాను ''

రోశమ్మ నవ్వింది ''నువ్వేం పని చేస్తున్నావేమిటి ?''

''టీచరమ్మగా ఒకచోట పని చేస్తున్నాను ''

''మనసు బండబారి, ఎంత డబ్బయినా ఖర్చు పెట్టడానికి సిద్ధపడ్డావా ?'' అంటూ రోశమ్మ లేచి, గిరిజ భుజంమీద చెయ్యి వేసింది ''నాకు డబ్బాశ లేదమ్మా ''

గిరిజ తల వొంచుకుంది ''పోనీ, ఏ సర్జన్ దగ్గరికైనా నన్ను తీసుకెళ్లండి ఆ మాత్రం ఉపకారమైనా చేసి పెట్టండి డాక్టర్ దివాకర్ గారు మీకు బాగా తెలుసని వసంత చెప్పింది ఆయన సిజేరియన్ ఆపరేషన్ లాంటిది చేసేటప్పుడు నర్సింగ్‌హోమ్‌కు మిమ్మల్ని తరచు పిలిపించుంటారంట కదా ?''

'అవును కాని, ఆయన దగ్గరికా ?''

''ఏం ?'' గిరిజ తల ఎత్తింది ''ఆయన హస్తవాసి మంచిదంటారే చాలామంది ? '

''నిజమేననుకో ఇలాంటి క్లిష్టమైన కేసులలో ఆయన తర్వాతే ఏ సర్జన్ అయినా కాని, ఆయన నర్సింగ్‌హోమ్‌కు నే వెళ్లి చాలా కాలమైందమ్మా ఈ మధ్య ఆయన కేసులను తీసుకోవడం లేదని విన్నాను

''ఏం ?''

''ఆయన ఒక్కగానొక్క కొడుకుని మృత్యువు బలిగొంది అప్పట్నుంచీ అదోలా అయిపోయారాయన భార్య అంతకు ముందే ఎప్పుడో పోయింది ఆమె ప్రతిరూపాన్ని కొడుకులో చూసుకుంటూ ఆ దు ఖాన్ని మరువగలిగారు చివరికి కొడుకు కూడా పోవడంతో ఆయనకిక 'నా' అనే వాళ్ళెవరూ మిగిల్లేదు తరతరాలకూ తరగని గంపెడంత ఆస్తి సగం తన కొడుక్కీ, మిగతా సగం కేన్సర్ రోగుల సహాయార్థం రాయాలనుకున్నారు కాని, తన తర్వాతి తరం ? తన వంశాంకురమే అంతరించి పోవడంతో ఆయన పడే ఆవేద ఇంతా అంతా కాదుట ఆ లంకంత కొంపలో బిక్కుబిక్కుమంటూ భారంగా కాలం గడుపుతూండాలి పరామర్శించేందుకు నేసెటు వెళ్లడానికి వీలుపడింది కాదు''

''ఆ పెద్దాయన ఆవేదన ఎంత కాలం ఉంటుంది ? నాలాంటి అభాగిని ఆవేదనే అంతం లేనిది దయచేసి, నాకోసం ఎలాగైనా ఆయన్ని త్వరలో కలుసుకోండి నా జాలిగాథతో వచ్చచెప్పండి బాధలో ఉన్న ఒకరిపై బాధలో ఉన్న మరొకరికి తప్పకుండా దయకలిగి తీరుతుంది ఆయన తప్పకుండా ఒప్పుకుంటారు ప్లీజ్, ప్రయత్నించి చూడండి '' గిరిజ లేచింది

''చూస్తాను ఆపైన భగవంతుని దయ ''

''ఆయన ఫీజెంత అడిగినా ఇస్తాను ''

''లక్షరూపాయలడిగినా ఇస్తావా ?'' రోశమ్మ నవ్వింది

''లక్షా ! అంత డబ్బు నా దగ్గర '' బెగాయిగా చూసింది గిరిజ

''పిచ్చిపిల్లా ! ఖంగారుపడకు రేపు ఉదయమే ఆయన్ని చూస్తాను మధ్యాహ్నం రెండుగంటల ప్రాంతంలో నన్ను కలుసుకోగలవా ?''

'తప్పకుండ కలుసుకుంటాను,'' అంటూ గిరిజ, రోశమ్మ రెండుచేతులూ పట్టుకుంది

* * *

ఎదురుగా గోడకున్న 'తుపానులో చిక్కుకున్న నావ' తైలవర్ణ చిత్రం క్రమక్రమంగా అస్పష్టమవ సాగింది దివాకర్ కళ్ళకు చెమ్మగిల్లిన కళ్ళను అద్దుకుంటూ రోశమ్మ వంక తిరిగాడు

''భార్య పోయినప్పుడు కూడా ఇంతబాధ ఎరుగను మళ్ళీ పెళ్ళి చేసుకుంటే ఆ వచ్చే సవతి తల్లి అబ్బాయిని సరిగా చూడదేమోనని నేనే తల్లీ తండ్రీగా వాడ్ని పెంచాను పెద్ద చేశాను చేతికందిన చెట్టంత కొడుకు పోయాక '' డాక్టర్ దివాకర్ కంఠం గద్గదికమైంది ''నా దుఃఖాన్ని తీర్చగలిగే వారెవరు ? ఏ జన్మలో ఏం పాపం చేశానో — నాతోనే మా వంశం అంతరించి పోవలసిందేనా ? రోశమ్మా, కనీసం నువ్వుచెప్పిన ఆ యువతి దుఃఖాన్నయినా తొలగించగలిగితే నా మనసుకు కాస్త ఉపశాంతి కలుగుతుందేమో ! మరో స్థితిలో అయితే, ఇలాంటి కేసును సుతరామూ అంగీకరించి ఉండేవాడ్నికాను నువ్వు చెప్పిందంతా విన్నాక — కత్తితోనాక మరే విధంగానూ ఆమె దుంఖాన్ని నివారించడానికి వీల్లేదేమో అనిపిస్తోంది చాలా కాలం తర్వాత కత్తిని చేపట్టే అవకాశం నాకీ విధంగా కలుగుతూంది,'' అంటూ దివాకర్ తన చేతుల వంక చూసుకున్నాడు

''డాక్టర్ గారూ! మీరు ఒప్పుకున్నారన్న విషయం తెలిస్తేనే ఆ అమ్మాయి దుఃఖం సగం కరిగిపోతుంది ఈ వేళ సాయంత్రమే ఆమెనిక్కడికి తీసుకొస్తాను,'' అంటూ రోశమ్మ లేచింది

* * *

ఆపరేషన్ టేబుల్‌మీద భూతాకారం లైటు వెలిగింది

''డాక్టర్‌గారూ !'' ఎక్కడో బవిలోంచి వెలువడుతున్నట్లుంది గిరిజ కంఠస్వరం

''పక్కనే ఉన్నారమ్మా!'' అది రోశమ్మ కంఠం

మరో నిమిషంలో ''ఏమిటమ్మా?'' ఈమారు దివాకర్ కంఠం

''ఆపరేషన్ సక్సెస్ అవుతుందంటారా, డాక్టర్‌గారూ ?''

''చాలాకాలం తర్వాత నేను కత్తి చేపట్టానని భయమా ? లేక — నీకుమల్లే నేను కూడా గంపెడు విచారంతో ఉన్నాను గనుక ఏదైనా పొరబాటు చేయవచ్చని భయపడుతున్నావామ్మా ?''

''నా ప్రాణంమీద భయం ఏనాడో పోయింది ఎటొచ్చీ ఒకవేళ అటువంటిదేదైనా జరిగితే నా హాండ్‌బాగ్‌లో ఒక కవర్ ఉంది అందులో ఉత్తరాన్ని తప్పకుండా చూడాలి మీరు ''

''ఆ అవసరం రాదు ఇక మత్తుమందు ఇస్తున్నాం ''

''విష్ యు ఆల్ ది ' క్రమక్రమంగా గిరిజ కనురెప్పలు బరువెక్కసాగాయి

''థాంక్యూ !'' దివాకర్ తెల్లతొడుగులున్న తన చేతుల వంక చూసుకున్నాడు ''గాడ్ ! బ్లెస్ దిస్ పూర్ లేడీ !''

వారం రోజులయ్యాక

దివాకర్‌ను చూడగానే గిరిజ చేతులు జోడించింది ''మీ సహాయాన్ని ఈ జన్మలో మరువలేను నా గుండెమీంచి కొండంత భారాన్ని దింపినట్లయింది ''

''అలాగా? సంతోషమమ్మా కాని, నా గుండె మాత్రం ఇంకా తేలికపడలేదమ్మా ''

గిరిజ మాటిగా చూసింది ''ఇక తేలికపడదా ?''

''ఏమో మొత్తంమీద చాలా కాలం తర్వాత నా వృత్తిమీద నాకు మళ్ళీ శ్రద్ధ కలిగించావు ''

''ఐతే, నేను గర్వపడాల్సిందే డాక్టర్‌గారూ ఇవేళ నన్ను డిశ్చార్జ్ చేస్తారా?''

దివాకర్ పరిశీలనగా చూశాడు ''వెరీగుడ్ ! అయినా, మరో రెండ్రోజులు ఇక్కడ ఉండి వెళ్తే మంచిదేమో !''

''ప్రాణంమీద నాకు తీపి లేదని చెప్పాగా డాక్టర్‌గారూ, మొత్తంమీద నా మచ్చను తొలగించి, నా నెత్తిన పాలు పోశారు ఇక అనుమతిస్తే, సెలవు తీసుకుంటాను '' గిరిజ మంచంమీద లేచి కూర్చుంది

''సరే ఎందుకైనా మంచిది వారం రోజులయ్యాక నాకోసారి కనిపించు ''

''నాపట్ల మీకంత వాత్సల్యం కలిగినందుకు ధన్యురాల్ని ''






## నాణేనికి మూడోవైపు

''ధైర్యంగల పేషెంటంటే - ఏ డాక్టర్‌కైనా ఇష్టమే ''

''కాని, నేను మీకు మళ్ళీ కనిపించనేమో!''

'నీ ఇష్టం'' దివాకర్ బరువుగా నిశ్వాస వదిలాడు

''ఈ కవర్ తీసుకోండి,'' అంటూ గిరిజ హేండ్‌బాగ్ లోంచి ఓ కవర్ తీసింది

''ఫీజు వద్దన్నాను కదా''

''ఈ కవర్ మాత్రం పుచ్చుకోకతప్పదు ఇది ఫీజు కాదు ఉత్తరం మాత్రమే ఒకవేళ ఆపరేషన్ జయప్రదంకాక నాకేదైనా ప్రమాదం సంభవిస్తే మీరు చూడాలని చెప్పానే ఆ ఉత్తరం మీతో ఎదురుగా చెప్పలేని నా మనసులోని విషయాన్ని ఈ ఉత్తరంలో పొందుపరిచాను ''

దివాకర్ నవ్వుకుంటూ ఆ ఉత్తరాన్ని పక్కనున్న నర్స్‌కు ఇచ్చి, ''నా రూమ్‌లో ఉంచు,'' అన్నాడు

గిరిజ హేండ్‌బాగ్‌ను భుజాన వేసుకుంది

హేండ్‌బాగ్ మీద మృదువుగా తట్టాడు దివాకర్

*  *  *

సాయంత్రం ఆరు కావస్తోంది రివ్వున వీచే గాలికి కిటికీ తెరలు రెపరెపలాడుతున్నాయి కుర్చీలో కూర్చోగానే గిరిజ ఉత్తరం గుర్తొచ్చింది దివాకర్‌కు నవ్వుకుంటూ తన చేతుల వంక చూసుకున్నాడు

ఇదివరకు శారీరక రోగాల్నే తొలగించే ఈ చేతులు ఇప్పుడు మనోరోగాన్ని కూడా తొలగించగలిగాయన్నమాట!

''పిచ్చిపిల్ల చాలా కాలానికి మళ్ళీ ఆపరేషన్ చేసే శక్తిని నాలో కలిగించింది పాపం! ఇంత చిన్న వయస్సులోనే భర్త దూరమయ్యాడు పిండెనూ దూరం చేసుకుంది ఒకవేళ ఆ బిడ్డే పుట్టితే అది చక్కని అబ్బాయి అయితే ఆ అబ్బాయిలో తన భర్తను చూసుకుని మురిసిపోయే భాగ్యాన్ని కాలదన్నుకుంది తోడు నీడగా ఉండి, పెరిగి పెద్దయ్యాక తల్లికి తోడ్పడడానికి ఆ అబ్బాయి కూడా నోచుకోలేకపోయాడు పాపం!'' నిట్టూరుస్తూ దివాకర్ మేజా సొరుగులోంచి ఉత్తరం తీశాడు

''డాక్టర్‌గారూ,

మీరు చేసిన సహాయానికి మరోసారి కృతజ్ఞతలర్పిస్తున్నాను మీ ఆస్తిలో సగ భాగం రోగుల సహాయార్థం వెచ్చించినా – మీరింత సేవ చేసి ఉండేవారు కారేమో! డాక్టర్‌గారూ! కసి తీర్చుకోవడంలో ఏదో తృప్తి ఉంటుందంటారు నిజమేననిపిస్తోంది మీ అబ్బాయి శశిధర్, నేను గుడ్డిగా ప్రేమించుకున్నాం నన్ను తప్పకుండా వివాహం చేసుకుంటానని ఆయన మాట ఇచ్చారు మాట తప్పే మనిషి కాదని నాకు బాగా తెలుసు అందుకే మనసుతోపాటు తనువునూ అర్పించాను కాని, మేము పేదవాళ్ళమని శశిధర్ తెలియజేయగానే మీరు మా వివాహానికి అంగీకరించనన్నారట ఆస్తిపాస్తులు, అంతస్తులు మీకు అడ్డొచ్చాయి ఆ రోజు ఆఖరి




## బి. ఎస్ పి పి - భీమవరం

ఎన్టీఆర్ శ్రీదేవిలతో తెలుగులో 'శాస్త్రీ' రిటేక్ చేస్తారట కామెంట్ ప్లీజ్?

★ తీయకపోతే వింతగాని తీస్తూంటే ఎందుకు స్వామీ భయం?! ఇప్పుడు తెలుగులో వస్తూన్న చిత్రాలన్నీ చాలామటుకు రీటేకులే!

'సన్' వారపత్రికలో సమాధానాలిచ్చే పీలూ మోడీకి మీకూ చాలా పోలికలున్నాయి జవాబులిచ్చే తీరులో కాని ఆయన పొలిటీషియన్ మీరు రచయిత్రి

★పీలూమోడీతో పోటీపడడం సులభమే— నా సైజూ ఆ సైజుకి పెరిగి పోతోంది! ఇక రాసే తీరులో పోలిక అంటారా? 'రచయిత్రే' అయినా కాస్త బుర్ర వుందని నిరూపిస్తూంది అంతేగా!

నాకు కలలో జాన్ ట్రవోల్టాలా డిస్కో డాన్సు చేస్తున్నట్టు

★ కల కనడం సహజమే నేనే 'ట్రవోల్టా'నని రోడ్లవెంట ఆడంగి నడకలు నడవడం అసహజం ప్రతి పనికీ—స్థలమూ సమయం వుంటాయి!

## కె ఎస్ పి రాజమండ్రి

నేను చిన్నప్పటినుండి డాక్టరు అవాలని అనుకున్నాను డాక్టరు అయితే జీవితం అంతా ప్రజా సేవ చేయవచ్చునని

★ ఇప్పటికి ఇంటర్‌కి వచ్చిన — నీ డాక్టరు గాథ సినిమాలో డాక్టర్ని చూసి బాధపడేదాక వచ్చిందా తమ్ముడూ! పాపం నా గాథ తెలుసా? అక్షరాలెందుకు నేర్చుకోడం—హాయిగా బ్రతకకుండా అని చిన్నప్పటినుంచీ మారాంచేసి పదేళ్ళు వచ్చేదాకా అఆలు ముట్టలేదు! అయినా రాత తప్పలేదు చూశావా మరి? బాధపడకు చివరికి ఏ సినిమాలోనైనా తెల్లకోటు వేషంలో చచ్చిపోయినవారి చెయ్యి పట్టి 'షి యీజ్ డెడ్' అనే గంభీరమైన డైలాగు వేమో ఎవరు చెప్పకలరు?! (మా పెద్దమామయ్య పుట్టినపాడే డాక్టరవ్వాలని నిర్ణయించుకున్నాట్ట ఎందుకో తెలుసా! రిటైరుమెంటులేని వృత్తి హాయిగా సంపాదించుకుంటూ బ్రతకొచ్చునని! డాక్టరయ్యాడు అయితే కుప్పలూ— భస్మాల వైద్యం ఎందర్ని చంపాడో నాకు తెలియదు!)

## కబీరు - అనంతపురం

'ఆడది ఎంత పెద్దపదవిలోఉన్నా ఎంత సంపదనా పరురాలైనా మగవాని మోచేతి నీరు త్రాగక తప్పదు' అనే డైలాగు మన సెన్సారు సభ్యురాలైన ఎంతో వ్యక్తిత్వంకల రామలక్ష్మిగారు ఒక తెలుగు సినిమాలో అంగీకరించారంటే ఆశ్చర్యంగావుంది

★ మీకు వుండొచ్చు ఆశ్చర్యంగా కాని నాకు లేదు—నేనా సినిమా చూడలేదు గనుక! అయినా ప్రతి సినిమా నల్గురే సభ్యులు చూస్తారు అందరూ చూడరు ఈ సినిమాలకి కమిటీలు వేయడం కూడ ఆఫీసరుగారి ఇష్టాయిష్టాలపై ఆధారపడివుంటుంది! అంచేత నాలాంటి వాళ్లా కొంచెం కచ్చితంగావుంటే వాళ్లా—నెలలో ఒకటో అరో సినిమాలు చూడ్డం జరుగుతూ వుంటుంది! అన్నిరంగాలలోలాగే యిక్కడ కూడ ఇష్టులూ, అయిష్టులూ వుంటూ వుంటారు! అన్ని రంగాలలోలాగే యిక్కడా కావలసిన పనులు చేయించుకో కలవాళ్లు వుంటూ వుంటారు అంచేత మీరు చూసి ''కత్తిరింప తగ్గవి'' వుండిపోయాయనుకుంటే — నాలాంటి వారిని ఆడిపోసుకో కూడదు సెన్సారు అధికారులకి రాయాలి

## ఎమ్ పి - బళ్లారి

తల్లి మాటవిని కొట్టే భర్తని ఏమనాలి!

★ పెళ్లాం అక్కరలేని మగవాడనాలి అయినా చెప్పుడు మాటలు వినేటంత అల్పబుద్ధి—చాలా అనాగరికం ఆ సంగతే తెలియ చెప్పాలి

## ఎస్ ఎ - అంపలాం

సమాజానికి ఉపకరించే రచనలు చేయడానికి మీరిచ్చే సలహా?

★ అచ్చేసే పెద్ద మనుషులను కూడా ముందు సృష్టించుకోవాలి రచన కూడా యీనాడు సినిమాలాగే ఎంటర్‌టైన్ చేస్తూనే చెప్పేది చెప్పకల్గాలి లేకపోతే ఎవరూ చదవరు అందుకనే నేటి రచనల్లో ''ఆవగింజంత'' ఆదర్శం ''గడ్డివామంత'' వినోదమయం వుంటుంది ఆ ఆవగింజంత ఆదర్శమేన రచనల్లో మిగులుతుంది సినిమాల్లో అదీ లేదు

## జి ఎస్ ఆర్ - నేలకొండపల్లి

ధనాన్ని కాంక్షించే స్త్రీని ఏమనాలి?

★ అలాంటి మగవాడిని ఏమంటాం అదే అంటే పోలే!!

సృష్టిలో అందమైనది ఏమిటి?

★ ప్రతిసృష్టి చేయగల స్త్రీయే

## కె కె ఎమ్ - పెద్దతెప్పసముద్రం

ప్రేమించడం మనిషి తప్పా? పదహారేళ్ళ వయస్సు తప్పా?

★ పదహారేళ్లకి ప్రేమేమిట నా ముఖం! వ్యక్తిత్వంగల పిల్లలనుగా తీర్చిదిద్దని తల్లితండ్రులది తప్పు ఇలాంటివి చూసినప్పుడే పిల్లల పెంపకం ఏం ఆషామాషీ పని కాదనిపిస్తుంది నాకు

## వై ఎల్ - కాకినాడ

ఒక మనిషి గురించి చెడుగా చెప్పినప్పుడు ఛీ అలాంటిది కాదన్నాను నన్ను ఆడిపోసుకున్నారు ఇప్పుడా మనిషికీ నాకూ ఘర్షణ వచ్చింది

★చూడు సోదరీ — యిలాంటి గొడవలన్నీ—'అతి' వల్ల ఏర్పడలాయని నా ఉద్దేశ్యం స్నేహం చేయండి కాని దానికి విలువనిచ్చి సహజంగా పెరగనివ్వండి స్నేహం చాలా శ్రద్ధగా పెంచవలసిన మొక్కలాంటిది తొందరపడి ఎక్కువనీరు పోసినా తక్కువ నీరుపోసినా కూడా వడిలిపోతుంది మనం హేళనజేసే విషయాలు మన వ్యక్తిత్వానికి అద్దం పడతాయి ●

---

సారిగా మీ దగ్గర అటో ఇటో తేల్చుకొస్తానని మా ఇంటినుంచి శశిధర్ బయలుదేరుతూ, గుళ్ళోపెళ్ళికి నన్ను వేణుగోపాలస్వామి ఆలయం వద్దకు వచ్చి సిద్ధంగా ఉండమని చెప్పి మరీ వెళ్లారు కాని, మీరు ఒప్పుకున్నట్టు లేదు అందుకే ఆయన ఆ ఆవేశంలో గుడికేసి కారు డ్రయివ్ చేస్తున్నవారల్లా—మధ్యలోనే ప్రమాదానికి లోనై ప్రాణాలు కోల్పోయారు నేను మిగిలాను నా కడుపులో ఆయన ప్రతిరూపం పెరుగుతూందని తెలుసు చెట్టంత ఆయనేపోయాక ఆ పిండాన్ని నా కడుపులో ఎంతకాలం భరించాలి? అసలు ఎందుకు ఆ పీడను దాచుకోవాలి? సాధారణంగా ఎవరైనా రెండువైపులే ఆలోచిస్తారు కాని, ఆలోచించడానికి మరోవైపు – మూడోవైపు కూడా ఉందని అంతులేని ఆవేదనలో నాకు ద్యోతకమైంది అందుకే, చివరికి నేనే మిమ్మల్ని కోరి ఈ ఘాతుకానికి పాల్పడ్డా – ఒక విధంగా నా బిడ్డ నాకు దక్కక పోవడానికి కారణం మీరే కదా? మీ అహంకారానికి బలి అయిన నేను మీ మనుమడ్ని ఈ భూమ్మీద ఎందుకు నడెయ్యాలి? మీ వంశ వృక్షాన్ని మీరే మీ చేజేతులా కూకటి వేళ్ళతో పెళ్ళగించాలి అందుకే రోశమ్మ ద్వారా ఇంతకు తెగించాను మీకు తగిన గుణపాఠం నేర్పానన్న తృప్తి నాలో మిగిలింది డాక్టర్‌గారూ! మీ చేతులారా —''

ఉత్తరాన్ని పట్టుకున్న తన రెండు చేతుల వంక చూసుకున్నాడు దివాకర్ కంపిస్తూన్న చేతుల మధ్యనుంచి ఆ కాగితం ఎగిరిపోయింది మరో క్షణంలో ఆ చేతులు నిర్జీవమై, ఎదురుగా ఉన్న టేబుల్‌మీద పడిపోయాయి

అతని తలకూడా ఒరిగింది 



# సినిమా విశేషాలు

-జి వి జి



'రాధమ్మ మొగుడు'లో జయమాలిని, చంద్రమోహన్

## మాలపిల్ల మనవరాలు

మా గురువుగారు స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మంగారు ఆలనాడు మాలపిల్ల నిర్మించారు నేను కళ్యాణ సంజయ్ ఇంటర్నేషనల్ నారి మాలపిల్ల మనవరాలు చిత్రాన్ని సమర్పిస్తున్నాను అన్నారు మన సత్యం యు విశ్వేశ్వరరావు కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో ఫిబ్రవరిలో చిత్రీకరణ మొదలయ్యే ఈ చిత్రంలో మాదాల రంగారావు సంగీత మంగళగౌరి ముఖ్యులు వారుంటారు ఎస్ ఆర్ నంది మాటలు కొండవీటి వెంకటకవి పాటలు రాస్తున్నారు నిర్మాతలు అజయ్ వంశీ

జనవరి 10న ఎన్ టి ఆర్ అధ్యక్షతన కళాసాగర్ ఆధ్వర్యంలో వేమన సత్యం శతకం స్వర్గీయ చిత్తూరు వి నాగయ్యకు అంకితమివ్వబడింది కొంగర జగ్గయ్య శతకాన్ని ఆవిష్కరించారు తొలి ప్రతి నాగయ్య సతీమణి జయమ్మకు అందజేయబడింది మన సత్యంలో వెలరేగిన భావాలకు 108 పద్యాలతో రూపకల్పన చేసిన కొండవీటి వెంకటకవిని ఈ సందర్భంలో ఘనంగా సన్మానించారు

## శోభన్‌బాబు కె రాఘవేంద్రరావుతో డి రామానాయుడు చిత్రం

శోభన్‌బాబు జయసుధ శ్రీదేవిలను ఇంత వరకు ఎన్నుకున్నాం అన్నారు సురేష్ ప్రొడక్షన్స్ అధినేత డి రామానాయుడు షూటింగ్ ఫిబ్రవరిలో మొదలై ఏప్రిల్‌కు పూర్తవుతుంది కె ఎస్ ప్రకాష్ ఛాయాగ్రాహకుడు కె రాఘవేంద్రరావు దర్శకుడు

కోరుకున్న మొగుడు లో జయసుధ శోభన్ బాబు

# సినిమా

## "తప్పిటికి వోరొచ్చింది"లో
## చంద్రమోహన్, జయసుధ

జమున గెస్ట్‌గా మా చిత్రంలో నటిస్తారు అన్నారు కట్టా సుబ్బారావు ఈయన దర్శకత్వంలో తాడి సత్యానందం పుష్పం ఆదినారాయణ నిర్మించే నరస నవరస చిత్రవారి పై చిత్రంలో చంద్రమోహన్ జయసుధ రావు గోపాలరావు అల్లురామలింగయ్యతో పాటు ఈ చిత్ర నిర్వాహకుడు ఏడిద గోపాలరావు కూడా నటిస్తారు ఆకాశవాణిలో తెలుగు వార్తలు చదివే ఏడిద గోపాలరావు కంఠం అందరికీ పరిచితమే ఈయన శంకరాభరణం చిత్ర నిర్మాత ఏడిద నాగేశ్వరరావు సోదరుడు



బంగారు కానుక లో నాగేశ్వరరావు శ్రీదేవి *

( నిప్పుతో చెలగాటం లో





జయసుధ కవిత

## డైరెక్టర్ రేలంగి నరసింహారావు చిత్రాలు

విడుదలైన తొలి చిత్రం నేమా మా ఆవిడ తోనే బహుముఖ ప్రశంసలందుకున్న రేలంగి నరసింహారావు దర్శకత్వం వెలిసిన యు ఎస్ ఆర్ మోహనరావు చిత్రం ఏవండోయ్ శ్రీమతిగారు కొన్ని చెయన్ చిత్రం చందమామ త్వరలో విడుదలకానున్నాయి చరిత చిత్రవారి ఉక్కు ఎడిశిల్ప చిత్రం షూటింగ్ ఫిబ్రవరి 1న మొదలవుతుంది యు ఎస్ ఆర్ మోహనరావు కొత్త చిత్రం మార్చి 25న ప్రారంభమవుతుంది ఇవి కాక – దిడ్డి శ్రీహరిరావు చిత్రం మ్వ్యం పట్టాభిరామారావు చిత్రం సుందర్ ఆర్ట్ మూవీస్ శ్రీదేవి సిలివ్ డిస్ట్రిబ్యూటర్స్ వారి చిత్రాలు త్వరలో ప్రారంభం కానున్నాయి

కృష్ణార్జునులు లో కృష్ణ శ్రీదేవి




ONLY



వేమన సత్యం శతకం ఆవిష్కరణ సందర్భంలో మన సత్యం
డా ఎన్ టి రామారావు కొండవీటి వెంకట కవిగార్లని చిత్రంలో చూడవచ్చు

## సినిమా

### "ఏమండోయ్ శ్రీమతిగారు"లో బస్ కండక్టర్ భార్య

గిరి (గిరిబాబు) హడావిడిగా ఇంట్లోకొచ్చాడు అమ్మా నీతో ఒక విషయం మాట్లాడాలి అదే శోభ పెళ్ళి గురించి

మహాలక్ష్మి (నిర్మల) ముఖం విప్పారింది నేను కూడా నీతో ఆ విషయమే మాట్లాడాలను కుంటున్నాను కూర్చో బాబూ ! శోభ గోపీ అనే ఒక అబ్బాయిని ప్రేమించిందట కుర్రవాడు బస్ కండక్టర్ ఉద్యోగం చేస్తున్నా – మనిషి మాత్రం చాలా మంచివాడటరా

ప్రేమించిందా ? మరి ఈ పాయింట్ నాకు తెలీదే ! అంటూ గిరిబాబు భార్య విజయ (కె విజయ) వంక చూడగా ఆమె ఎంత మంచి వాడైతే మాత్రం చూస్తూ చూస్తూ బస్ కండక్టర్‌కిచ్చి పెళ్ళి చెయ్యలేం కదా ? ఏమండీ ! అంది

అదీ పాయింటే అమ్మా శోభని పెళ్ళి చేసుకోవాలని నరేంద్ర చాలా ఆశపడుతున్నాడు అన్నాడు గిరిబాబు

మా తమ్ముడ్ని కాదనడానికి – వాడికేం తక్కువని ? అడిగింది విజయ

అదే కదా చెప్తున్నాను అని వంతపాడాడు గిరిబాబు

మహాలక్ష్మి నచ్చజెప్పింది చూడు బాబూ ! శోభ ఇంకా చిన్నపిల్ల కాదు దానికీ వయసొచ్చింది దాన్ని గురించి అది ఆలోచించుకునే జ్ఞానం కూడా వచ్చింది

అదీ పాయింటే ! అని గిరి తపీమని అనేసరికి విజయకు అరికాలిమంట నెత్తికెక్కింది అదేం పాయింటండీ వెధవ పాయింటు ? మా తమ్ముడంటే ఎవరనుకున్నారు ? స్టేట్ బాంక్ అంత గొప్పవాడు కో అంటే చాలు – కోటిమంది అందగత్తెలు పరుగెత్తుకు వస్తారు తెలుసా ? అంది

శోభ (రాధిక) గంభీరంగా అన్నయ్యా మనందరి కంటే పెద్దదైన అమ్మ ఒప్పుకున్నప్పుడు మరు కాదనడంలో అర్థంలేదు మీరంతా నా క్షేమం కోరేవారైతే నా పెళ్ళి నా ఇష్ట ప్రకారమే జరిపించండి లేదా – పెళ్ళి మాట ఎత్తకుండా ఇలాగే వదిలేయండి అంటూ చరచరా వెళ్ళిపోయింది

అదీ పాయింటే అంటూ నేను డైరెక్టర్ రేలంగి నరసింహారావు వంక తిరిగి గోపీ పాత్రధారి చంద్రమోహనే కదా ? అన్నాను అవును ఈ చిత్రంలో అందరివీ వెరైటీ పాత్రలు అవి జనవరి నెలాఖరున ఫిబ్రవరిలో రిలీజ్ చేస్తున్నాం అన్నారు రాజలక్ష్మి కంబైన్స్ అధినేత యు ఎస్ ఆర్ మోహనరావు

తప్పక
చూడండి!

జయంతిలాల్ యంషా
సమర్పించు
జాన్‌పాక్ ఇంటర్నేషనల్




స్క్రీన్‌ప్లే-డైరక్షన్: N. గోపాలకృష్ణ BSc.,

నిర్మాతలు: G. అప్పారావు S. తాజుద్దీన్

NAVRANG

## ఆనాటి ముచ్చట్లు

★ వాక్చిత్రాలు వచ్చిన తొలి రోజుల్లో ప్రతి చిత్రంలో ఎన్నో పాటలున్నాయని ముందుగా ప్రచారం చేసేవారు 'సతీ సావిత్రి' అనే తమిళ చిత్రంలో యమధర్మరాజు పాత్రధారి వి ఎ చెల్లప్ప స్వయంగా గాయకుడవడం వల్ల అతనిచే ఎన్నో పాటలు పాడించారు ఆఖరికి సత్యవంతుడి ప్రాణాలు తీసుకెళ్ళే ముందు పాశం విసిరినప్పుడు కూడా చాలాసేపు ఆలాపిస్తూ ఒక పాట పాడతాడు ఆ చిత్రం గురించి ప్రముఖ తమిళ రచయిత కల్కి తన పత్రికలో సమీక్షిస్తూ యమధర్మరాజు పాత్రధారి తన సుదీర్ఘమైన గానంతో సత్యవంతుడి ప్రాణాలేకాక ప్రేక్షకుల ప్రాణాలను కూడా తోడేస్తాడు అని చమత్కరించారు.

★ 1934లో ధ్రువ కుమార్ కన్నడ చిత్రం విడుదలైంది అరణ్యంలో ధ్రువుడు తపస్సు చేసేటప్పుడు తెరమీద చూపించిన సింహానికి ప్రేక్షకులు భయపడి థియేటర్లోంచి బయటకు పారిపోయారట మరో హాలులో తిరిగిన ఓ సింహం మాత్రం ఆ హాలులోనే ప్రసవించిందట !

★ చాలాకాలం క్రితం సుప్రసిద్ధ హిందీ దర్శకుడు స్వర్గీయ నితిన్‌బోస్ దర్ద్ – ఎ – దిల్ అనే చిత్రాన్ని రూపొందించాడు ఫైనల్ ఎడిటింగ్‌లో ఆ చిత్రం నిడివి 10 500 అడుగులకు తేలింది నిడివి పెంచేందుకు అదనంగా సన్నివేశాలు చేర్చడానికి ఆయనకు మతిరాము ఇష్టంలేదు అంచేత అలాగే విడుదల చేయక తప్పిందికాదు పంపిణీదారులకు ఇండోర్‌లోని ఓ థియేటర్‌కు ఆ ప్రింట్‌ను పంపినప్పుడు ఆ థియేటర్ యజమాని ఆదుర్దాతో మీరు పంపిన ట్రెయిలర్ మాత్రం అందింది అసలు చిత్రాన్ని పంపలేదేం ? అని అమాయకంగా ఎక్స్‌ప్రెస్ టెలిగ్రామ్‌ను పంపించాడట

విప్లవ శంఖం'లో మాదాల రంగారావు, త్రివేణి





"ఇది ఫైటింగ్ సీను కాదు హీరోగారూ ! లవ్ సీను !"

## సినిమా

### డైరెక్టర్ టి ఎల్ వి ప్రసాద్ చిత్రాలు

డాక్టర్ టి కె ఎం ఛటర్జీ నిర్మించే రావ్ శాంకో ఆర్ట్ క్రియేషన్స్ రాగం తానం పల్లవి చిత్రం షూటింగ్ విజయవాడలో డిసెంబర్4నుంచి జనవరి4తో ఏకబిగిన పూర్తయింది చంద్రమోహన్ సరసన బొంబాయి తార పూజా సక్సేనా నాయిక ఎం పి ప్రసాద్ హరిప్రసాద్ కార్యదర్శి కృష్ణజీ కృష్ణవేణి రూపాలతోపాటు కవి వేటూరి సంగీత దర్శకుడు చక్రవర్తి కామెడీ విలన్‌గా కట్టా సుబ్బారావు నటించారు భాగ్యరాజా కథకు కాశీ విశ్వనాథ్ సంభాషణలకర్త పి దేవరాజ్ ఛాయాగ్రాహకుడు

ఫిబ్రవరి 19న చిత్రీకరణ మొదలయ్యే అనిల్ ప్రొడక్షన్స్ టెంగు రంగడు లో చిరంజీవి సరస ఒక నూతన నటి నాయిక జగ్గయ్య రావు గోపాలరావు నూతన్‌ప్రసాద్ సత్యనారాయణ జానకి ఆదిగాగల వారుంటారు మార్చి నెలాఖరుకు షూటింగ్ పూర్తవుతుంది

అక్టోబర్ నుంచి డిసెంబర్ వరకు ప్రతినెలా 1–10 తారీఖుల మధ్య చిత్రీకరణ జరిగే అనిల్ ప్రొడక్షన్స్ పాదాభివందనం లో శ్రీదేవి ద్విపాత్రలు ధరిస్తుంది శరత్‌బాబు జగ్గయ్య సత్యనారాయణ నూతన్‌ప్రసాద్ ప్రతాప్‌పోతన్ వగైరా నటవర్గం

అనిల్ ప్రొడక్షన్స్‌వారి పై రెండు చిత్రాలకూ వేటూరి గీతాలు చక్రవర్తి సంగీతం పి దేవరాజ్ ఛాయతో తాతినేని ప్రకాశరావు నిర్మిస్తారు

కథ సిద్ధంగా ఉన్న రావ్ శ్యామ్ క్రియేషన్స్ వారి మరో భారీ చిత్రంలో సూపర్ స్టార్ 'హీరో

ఏలూరి దుర్గాప్రసాద్ సమర్పించు

అభినయ ఆర్ట్స్ క్రియేషన్స్

THARAKAPRABHU ADS

# వంశ గౌరవం

ఈస్ట్‌మన్ కలర్

స్క్రీన్‌ప్లే దర్శకత్వం
**యన్ రవీంద్రరెడ్డి**

నిర్వహణ బొక్కిసం ఆంజనేయులు

సంగీతం చక్రవర్తి మాటలు జంధ్యాల

పాటలు వేటూరి కెమెరా వెంకట్

నిర్మాతలు
**జాగర్లమూడి ఆదినారాయణరావు**
**రావి ఆంజనేయులు**



కృష్ణా ఎ.లక్ష్మీనారాయణ విజయవాడ గుంటూరు నెల్లూరు కళ్యాణి ఫిలింస్ పశ్చిమగోదావరి ఉషా పిక్చర్స్ ఏలూరు.

సీడెడ్ భాస్కర్ పిక్చర్స్ నైజాం విక్రమ్ ఫిలింస్ ఒరిస్సా శ్రీ వెంకటలక్ష్మి పిక్చర్స్

# సినిమా

## ధర్మవడ్డీ

ఆనాడూ ఈనాడూకూడా బడుగు వర్గాలపై దోపిడీ అవిచ్ఛిన్నంగా సాగుతూనే ఉంది. ఆనాటి తెల్లదొరల స్థానాన్ని ఈనాటి నల్లదొరలు ఆక్రమించుకున్నారంతే. ఆర్థిక సామాజిక అసమానతల మధ్య దేశంలో సమతా భావం పెంపొందదు. స్వాతంత్ర్యం వచ్చినాక ధనికుల ఆస్తిపాస్తులు మరింత పెరిగాయి. పేదలు మరింత చితికిపోయారు. కారణం - మన ఆర్థిక వ్యవస్థ. ఇది మారాలి. ముఖ్యంగా ఇది మధ్యనున్న దళారీల ఉక్కు పిడికిళ్ళ నుంచి బయటపడాలి. ఆ విషయాన్ని గుండెలకు గుచ్చినట్టు చెప్పే స్వర్గీయ గోపీచంద్‌గారి ధర్మవడ్డీ ఇతివృత్తాన్ని తెరకెక్కించడానికి అదే కారణం అన్నారు రూపచిత్ర కళామందిర్ వారి ధర్మవడ్డీ చిత్ర దర్శకుడు కె.బి. తిలక్. ఆయన ఉత్తమాభిరుచులు, అభ్యుదయ భావాలు గల వ్యక్తి. మామూలు సినిమా ఫార్ములాకు అతీతంగా ఉండే చిత్రాలు తీయాలనేదే ఆది నుంచీ ఈయన ధ్యేయం. ఈయన ఏ చిత్రం తీసినా — ఒక స్పష్టమైన దృక్పథం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. మన ప్రాంతీయత ప్రతిబింబిస్తుంది. ఏ ఇతివృత్తం తీసుకున్నా — అన్ని కోణాల నుంచి కూలంకషంగా తర్జనభర్జన చేసి నిండుతనాన్ని తీసుకురావడానికి శ్రమిస్తారు. పాటలు రాయించేటప్పుడు, వాటిని చిత్రీకరించేటప్పుడు కూడా నవ్యతకు పాటుపడ్తారు. ప్రజల అభిరుచులను బట్టే చిత్రాలను తయారు చేయకూడదు. వారి అభిరుచులలో మార్పుతేగల చిత్రాలు తయారవ్వాలి. కొత్తరకమైన చిత్రాలు చూడడం ప్రజలకు మనమే అలవాటు చేయాలి అనే అభిప్రాయం గలవారిలో తిలక్ ఒకరు. నిప్పులు చెరిగే ఎండలో నిజామాబాద్ జిల్లాలోని ఓ బాగా వెనుకబడిన గ్రామంలో తయారైంది ధర్మవడ్డీ చిత్రం. జగ్గయ్య, నూతన్‌ప్రసాద్, సుధాకర్, సాయిచంద్, ప్రభ, కృష్ణవేణి, అన్నపూర్ణ వగైరా నటవర్గం. రాజాశివానంద్ సంభాషణలకర్త. శ్రీశ్రీ, రాజాశివానంద్, జి. వై. గిరి గీతాలకు పెండ్యాల నాగేశ్వరరావు స్వరకల్పన చేశారు. దొమ్మేటి సుబ్రహ్మణ్యం ఛాయ. వెంకటేశ్వరరావు కూర్పులతో అడుసుమల్లి నాగేంద్రప్రసాద్, పి. వి. రమణయ్య ఈ చిత్ర నిర్మాతలు.



'అంధకేసరి'లో విజయచందర్

ఇంతలో చేతిలో పుస్తకాలు టిఫిన్ కేరియర్‌తో ...ంగ వస్తూ డాడీ నేనూ రెడీ అంది ...కి వెళ్ళే హడావుడిలో

...దుష్టశక్తులకు పులే అయినా కన్నకూతురి ...ట పసిపిల్లాడే ఆ పోలీసాఫీసర్ అందుకే ముసి నవ్వులతో నేనూ రెడీయే ఏ డ్యూటీలో ...—నీ డ్యూటీ తప్పదుగా నాకు? పద పద ...న్నాడు

కట్ ఓ–కే! షాట్ చాలా బాగా వచ్చిం దన్నంత సంతృప్తి ధ్వనించింది రామినీడు కంఠంలో హైదరాబాద్ శ్రీ సారథీ స్టూడియోలో తయారైన తొలి చిత్రం మా ఇంటి మహాలక్ష్మి కి దర్శకత్వం వహించిన ఘనత రామినీడుదే అనురాగం పల్నాటి యుద్ధం కలిమిలేములు మూగ పేమ ఛైర్మన్ చలమయ్య వగైరా చిత్రాల ద్వారా అనుభూతి చిత్రాల ప్రజానకర్త అని కీర్తింపబడ్డ రామినీడు జనవరి 5 నుం. 15 లోగా తొలి షెడ్యూల్ పూర్తయింది ఇదే తేదీలలో ఫిబ్రవరిలో సెకెండ్ షెడ్యూల్ ఉంటుంది మార్చిలో ...వరి షెడ్యూల్ అన్నారు

గంభీరమైన పోలీస్ ఆఫీసర్‌గ యంగ్ లాయర్‌గా వైవిధ్యపూరితమైన తండ్రీ తనయుల పాత్రలను శోభన్‌బాబు పోషిస్తున్నారు చిన్నకొడుకు మురళీమోహన్ కుమార్తె పాత్రను నటి గిరిజ కూతురు శ్రీ గంగ నిర్వహిస్తోంది శారద మాదాల రంగారావు రావు గోపాలరావు రాళ్ళపల్లి విజయశాంతి మాస్టర్ వెంకటేశ్వర్లు వగైరా తారా సందోహం మోహన్‌దాస్ సంభాషణలకర్త చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి దాసం గీతాలు రాశారు లక్ష్మణ్‌గోరే ఛాయ దిలీప్‌సింగ్ శిల్పం అంకిరెడ్డి కూర్పు సలీం నృత్యాలు కె సతీష్ — జి టి ప్రసాద్ సహకార దర్శకత్వం కోగంటి భాస్కరరావు నిర్మాణ సారథ్యంతో అలపాటి రంగారావు నిర్మాత

## ఇంట్లో రామయ్య–వీధిలో కృష్ణయ్య

మా చిత్రంలో నాతోపాటు తెరవెనుక కృషి చేసిన అయిదుగురి పేర్లు రా తో ప్రారంభ మవుతాయి అంటూ ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ అధినేత రాఘవ ఇలా వివరించారు నేను — రాఘవ మా మ్యూజిక్ డైరెక్టర్ జె వి రాఘవులు డైరెక్టర్ కోడి రామకృష్ణ కో డైరెక్టర్ రామశ్రీ అసిస్టెంట్ డైరెక్టర్ లాటి రామకృష్ణ తమాషాగా లేదూ?'' అన్నారు

కెమెరామెన్ ఎస్ ఎస్ లాల్ మరో తమాషా చెప్పనా? లంచ్ సమయంలో షూటింగ్‌ను ...పు చేసినప్పుడు బ్రేక్ అనీ రోజంతా షూటింగ్ జరిపాక చివరన పేక్ అప్ అని కదా అంటాం ఈ చిత్రం షూటింగప్పుడు పేకప్‌లు లేవు అంతా బ్రేక్‌లే అంటే ఒక్కోరోజు రాత్రి మూడుగంటల

గోల్కొండ అబ్బులు లో



కృష్ణంరాజు జయప్రద

వరకు షూటింగ్ జరిగేది మళ్ళీ వెంటనే నాలుగు గంటలకల్లా షూటింగ్ ప్రారంభించాలి అంచేత ఆ ఒక్క గంట విరామ సమయం పేకప్ ఎలా అవుతుంది? బ్రో! అన్నారు

జీవితంలో తటస్థపడే కొన్ని పాత్రల ఆధారంగా తయారైన ఈ చిత్ర దర్శకుడు కోడి రామకృష్ణ చక్కని చిత్రకారుడు. స్టేట్ లెవెల్‌లో బహుమతి పొందాడు. పాలకొల్లు ఎ ఎస్ ఎన్ మూర్తి కళాశాలలో చదువుకునేటప్పుడు నాలుగేళ్ళు వరుసగా ఉత్తమ నటుడు ఉత్తమ రచయిత ఉత్తమ దర్శకుడుగా బహుమతులందుకున్నాడు పుస్తక రూపంలో వెలువడిన ఈయన రచనలు రథ చక్రాలు రేపు సెలవు శుభకార్యాలు ఇంద్రగోల పుష్కరాలు ...న్న — నేడు రేపు 



రంగూన్ రౌడీ లో కృష్ణ కమల్‌హాసన్

## గుత్తా రామినీడు దర్శకత్వంలో శ్రీవాణి మూవీస్ చిత్రం

థాంక్యూ మై ఫ్రెండ్! అన్నాడు కమీష నర్ కమలనాథ్ (శోభన్‌బాబు) ఆ దివ్యభవనంలో మెట్లపైనుంచి దుష్టశక్తులనుండి నగర పౌరులకు రక్షణ కల్పించే ఆ ఉన్నతోద్యోగి డ్యూటీకి బయలు దేరబోతూంటే పెంపుడుకుక్క ఎంతో డిసిప్లిన్డ్‌గా సెల్యూట్ చేసినందుకు ఆ మెప్పుకోలు ఆయన కొడుకు ఎస్ ఐ (మురళీమోహన్) కూడా సెల్యూట్ చేశాడు

ఇద్దరూ చెరోవైపునుండి మెట్లుదిగి కిందికి చేరుకున్నారు

చట్టంతో చెలగాటం లో రాజేష్ సుమంగళి శాంత



సీరియల్

# జీవిత వసంత కొత్తగాలి

కుందుర్తి ఇందిరాదేవి

(గత సంచిక తరువాయి)

వారం రోజులు గడిచాయి. నేను బాబుకి స్నానం చేయించి, బట్టలు వేసి, మంచంమీద బొమ్మలు పెట్టి వాడినీ కూర్చోపెట్టి గది కడుగుతున్నాను. బాబు మారాం చెయ్యటంతో "అమ్మ, నాన్నా, అత్త, తాత" అని మాటలు చెప్పి వాడిచేత పలికిస్తున్నాను. వాడు "మమ్మీ... డాడీ" అంటుంటే నాకు నవ్వొచ్చింది. ఇంతలో బయట ఆటో చప్పుడు వినిపించింది గుడ్డతో బండలు తుడుస్తున్న నేను చప్పున కిటికీలోంచి చూశాను. తెల్లటి బట్టలలో గేటు తీసుకుని వస్తున్న కిరణ్‌ని చూసి నేను చప్పున గుడ్డ బాత్‌రూమ్‌లో పడేసి ముందు గదిలోకి పరిగెత్తుకొచ్చాను.

కిరణ్ అప్పటికే గుమ్మంలోకి వచ్చాడు. నేను చప్పున ఎదురువెళ్ళి "హాయ్ రా! రా! ఎప్పుడు వచ్చావు" అన్నాను ఆనందంగా.

అతను నవ్వుతూ "రాత్రి వచ్చాను. అప్పుడే వద్దామనుకుని ఓపికలేక పడుకున్నాను" అన్నాడు.

"రా... రా ." అంటూ చెయ్యిపట్టి తీసుకు వెళ్ళి సోఫాలో కూర్చోపెట్టాను. ఆ రోజు ఆదివారం కావటంతో సుధాకర్, ఉష, ప్రకాష్ ఇంట్లోనే ఉన్నారు. ఇంట్లో ఇడ్లీ ప్లేట్లు సర్దుతున్న శశి ముందు గదిలోకి తొంగిచూసి మళ్ళీ మాయమైంది.

కిరణ్ జేబులోంచి చాక్లెట్ ప్యాకెట్ తీసి శశి కొడుక్కి ఇచ్చాడు. నావైపు తిరిగి "ఏమిటీ అవతారం" అన్నాడు.

నేను చప్పున నావైపు చూసుకున్నాను చీర కుచ్చెళ్ళు దోపి ఉన్నాయి. లోపల ఎర్రటి లంగా కనబడుతోంది జడ వేసుకోలేదు ముడి వేసుకుని ఉన్నాను

"ఎలా ఉన్నానేంటి" అన్నాను.

"అచ్చు అప్పలమ్మలా ఉన్నావు" అన్నాడు

నేను పకపకా నవ్వాను.

"ఇంతకీ నీ దత్తపుత్రుడేడి."

"ఓ సారీ ! ఉండు నీ పుత్రుణ్ణి తెస్తాను" అని లోపలికి పరిగెత్తి వాడిని ఎత్తుకుని "ఒరేయ్ పదరా. మీ డాడీ వచ్చాడు" అన్నాను.

కిరణ్ చేతులు చాచగానే కమల్ ఒక్కసారిగ దూకాడు.

నేను ప్రకాష్‌ని, సుధాకర్‌ని కిరణ్‌కి పరిచయం చేశాను వంట గదిలోకి పరిగెత్తి "టిఫిన్ ఉందా" అన్నాను.

"ఊ! ఇంతవరకూ ఎవ్వరూ తినలేదు" అంది.

అమ్మ కిరణ్‌ని చూసి నిర్ఘాంతపోయింది ...ను గబగబా కుర్చీలు తెచ్చాను. అతనే సర్దివేశాడు. నేను కిరణ్ పక్కనే కూర్చున్నాను. పిల్లలు లోపల తినేశారు.

మగవాళ్ళు ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూనే ఉన్నారు. బాబుని ముద్దులాడుతున్న నన్ను కిరణ్ కసిరి —

"చప్పున స్నానం చేసిరా బయటకి వెడదాం" అన్నాడు. నేను గబగబా స్నానం చేసి రెడీ అయిపోయాను

కిరణ్ బాబు బట్టలు, బొమ్మలు సూట్‌కేస్‌లో సర్దుతూ "అబ్బో వీటికింద చాలా తగలేసి నట్టున్నావే" అన్నాడు. అప్పటికే ఆ బొమ్మల ఆకారాలు మార్చేశాడు కమల్.

"వెళ్ళొస్తానండి" అతను మర్యాదగా ఇంట్లో అందరికీ చెప్పేశాడు. నేను అతనితో సాయంత్రం దాకా ఆ కబుర్లు, ఈ కబుర్లూ చెబుతూ గడిపేశాను. మధ్యాహ్నం సినిమా చూసి, హోటల్లో భోజనం చేసి తిరిగివస్తుంటే అతను నెమ్మదిగా అన్నాడు —

"ఇంకా వేశేషాలేమిటి సంధ్యా."

"ఊహు ఏమీలేవు" అన్నాను ఉదాసీనంగా

"ఏమైనా మాట్లాడు" అన్నాడు మళ్ళీ.

"మాట్లాడ్డానికి ఏముంది" అన్నాను

అతను బరువుగా నిట్టూర్చాడు. అతను ఎందుకో బాధపడుతున్నాడు. అతను పెళ్ళి ప్రసక్తి తెస్తాడేమో అని ఎంతగానో ఎదురుచూశాను ఊహూ అతను ఆ ప్రస్తావనే ఎత్తలేదు. దిగులు నిండిన మనసుతో ఇంట్లోకి వచ్చిన నన్ను చూసి అందరూ నిర్ఘాంతపోయారు ఆ రాత్రి నాకసలు నిద్రపట్టలేదు.

## 36

ఫల్గుణ కొడుకు బారసాల అమ్మ వాడికి మా నాన్న పేరు పెట్టాలని చెప్పింది అటు రాణి మా నాన్న పేరు పెడతాను అని కూర్చుంది. చివరికి రాము అని పెట్టారు. భోజనాలయి అందరూ వెళ్ళిపోయారు. నాకు అసలు బాగాలేదు. ఒళ్ళు వెచ్చగా ఉంది, ఈమధ్య రోజూ కొద్దిగా టెంపరేచర్ రావటం మళ్ళీ తగ్గిపోవటం. రాత్రంతా నిద్రకూడా పోలేదేమో తలనెప్పిగా కూడా ఉంది.

అమ్మ రాణి దగ్గరకెళ్ళి "రాము అని ఎందుకు పెట్టావు ?" అని పోట్లాడింది.

"మా నాన్న నా కోసం ఇల్లుకట్టించి ఇచ్చాడు. నా కొడుక్కి మురుగులు, మొలో గొలుసు, ఉంగరం అన్నీ చేయిస్తానన్నాడు మరి, మా డాడీ పేరు పెట్టుకోవడంలో తప్పేం ఉంది" అంది

"ఒక్కగానొక్క కొడుకువు. మీ నాన్న పేరు

**జరిగిన కథ - 16 :** కుటుంబ భారం తనపై వేసి తండ్రి కన్నుమూయగా, సంధ్య ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితోపాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్ళను పోషిస్తూ వాళ్ళకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది. ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతుంది. శశి చదువు పూర్తయి ఉద్యోగంలో చేరగానే ఆమెకు ఆ ఇంటి బాధ్యత అప్పగించి సంధ్యా, కిరణ్‌లు పెళ్ళి చేసుకొని తామూ సహాయపడాలని నిశ్చయించుకొంటారు. ఉద్యోగంలో చేరి ఆ ఇంటికి ఆధారం అవుతుందనుకొన్న శశి, ప్రకాష్‌ని పెళ్ళి చేసుకొని వెళ్ళిపోవడంతో, దిక్కుతోచని పక్షిలా విలవిలలాడిపోతుంది సంధ్య. శశికి ఉద్యోగం వస్తే, తన అత్తగారికి ఇష్టం లేకపోవడంతో చేయనని ఖచ్చితంగా చెప్పేసి వెళ్ళిపోతుంది. కిరణ్‌కి బొంబాయి ట్రాన్స్‌ఫర్ అవడంతో మరీ కృంగిపోతుంది సంధ్య. సంధ్యా కిరణ్‌లు పెళ్ళి చేసుకోవడం ఇరు కుటుంబాలకూ ఇష్టంలేదు. కిరణ్ వివాహ ఆహ్వాన శుభలేక అందుకొని మూర్ఛపోతుంది సంధ్య. కమలతో కిరణ్ వివాహం జరగటం, ఓ మగపిల్లవాణ్ణి ప్రసవించి కమల చనిపోవడం, కొడుకును సుగుణ కప్పగించి కిరణ్ పారిస్ వెళ్ళిపోవడం వెంటవెంటనే జరిగిపోతాయి. సంధ్య జీవితం మామూలే. ఈలోగా ఉష తమ కులం కానివాడ్ని ప్రేమించి 'నువ్వు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా అతన్నే పెళ్ళి చేసుకుతీరతాన'ని సంధ్య మొహంమీదే చెప్పేస్తుంది. కలవారి అమ్మాయి రాణిని చేసుకుని ఇల్లరికం వెళ్తాడు తమ్ముడు ఫల్గుణ. కిరణ్ కొడుక్కి 'కమల్' అని పేరు పెడుతుంది సంధ్య. వారం రోజుల్లో వచ్చేస్తానని కిరణ్ బెంగుళూర్ వెళ్ళగా సంధ్య కమల్‌ను తనదగ్గరకు తెచ్చుకొంటుంది.

పెట్టరా అని నీకు ఎంత చెప్పినా నా మాట వినలేదు'' అని ఫల్గుణమీద మండిపడింది.

''ఏదో పేరులేమ్మా'' అని నేను సర్ది చెప్ప బోయాను.

''ఏంటండీ బెల్లంకొట్టిన రాయిలా అలా ఊరు కుంటారు. మా నాన్న మన కోసం ఎంత చేశారు. బ్రహ్మాండమైన ఇల్లు ఇచ్చారు. మీ నాన్న మీకే మిచ్చారు. ఆయనపేరు పురుషోత్తమరావుట. అలాటి పేరు ఎవరు పెట్టుకుంటారు'' అని ఈసడించింది

వాళ్ళ అత్తగారు రయ్యిన అందుకుని ''మేం గాబట్టి ఇన్ని ముచ్చట్లు జరిపాం. ఇంకా మాటలా. ఏదో అమ్మాయి ముచ్చటపడి వాళ్ళ డాడీ పేరు పెట్టుకుంది'' అంది.

''మన కోసం ఇంత శ్రమపడి ఇల్లు కట్టించి ఇచ్చినందుకైనా ఆయన పేరు పెట్టుకోవచ్చే. మీ నాన్న మనకేం ఇచ్చారని'' అంది హేళనగా.

అమ్మ కళ్ళనెంట నీళ్ళు బొటబొట కారాయి. నేను సహించలేకపోయాను.

''చాలా బాగా చెప్పావు రాణీ ! మీ నాన్న నీకు ఈ ఇల్లు మాత్రం ఇచ్చాడు. మరి మా నాన్న నీకు దానికన్నా విలువైన పాతికేళ్ళ కొడుకునే ఇచ్చాడుగా. మా వాడి కాలి గోటికి సరిపోతుందా మీ నాన్న ఇచ్చిన ఇల్లు'' అన్నాను.

''వదినగారు !'' రాణీ రోషంగా చూసింది.

''నేను కష్టపడి, అప్పులుచేసి వాడికి మెడిసన్ చెప్పించాను. ఆ చదువుకన్నా గొప్పదా మీ నాన్న ఇచ్చిన ఇల్లు. వాడు సంపాదనాపరుడు. ఇటువంటివి పది కొనగలడు ?'' అన్నాను విసురుగా.

ఫల్గుణ అత్తగారు నోటికి పక్షవాతం వచ్చి నట్టుగా చూడసాగింది. అమ్మ సంభ్రమంగా చూస్తోంది. ఫల్గుణ విప్పారిన నేత్రాలతో చూస్తున్నాడు. నిజానికి వాడికి అసలు స్వాతంత్ర్యం లేదు ఆ ఇంట్లో.

''ఏం విలువ గలది తల్లీ ఈ ఇల్లు. గట్టిగా గాలేస్తే, ఒక్క తుఫాను కొడితే దెబ్బకి కూలి పోతుంది మీ నాన్న ఇచ్చిన ఇల్లు. కానీ మా నాన్న, నేను నీకు ప్రసాదించిన ఈ ఇరవైఐదు సంవత్సరాల డాక్టర్ మీ నాన్న నీకు ఇచ్చిన కానుకలకి ఏనాడూ సరితూగడు. నోరు నీకే గాదు. మాకూ ఉంది. జాగ్రత్తగా మాట్లాడ్డం నేర్చుకో. రామ్మా'' అని లేచాను విసురుగా.

''అక్కా ! నేను కార్లో దిగబెడతాను ఉండు'' అన్నాడు ఫల్గుణ.

నేను నిర్లక్ష్యంగా అన్నాను – ''హు ! డబ్బు పారేస్తే ఏ టాక్సీవాడైనా సలాంకొట్టి క్షేమంగా ఇంటికి చేరుస్తాడు'' అన్నాను. ఇద్దరం వచ్చే స్తుంటే వెనక ఫల్గుణ అత్తగారు రాణిని చివాట్లే యటం వినిపించింది.

నేను దోవలో మా వీధి చివర ఉన్న డాక్టర్ కృష్ణకుమారి దగ్గరకెళ్ళి టాబ్లెట్లుతెచ్చుకున్నాను నాకు ఎంత జ్వరం రానీ ఫల్గుణ దగ్గరికి వెళ్ళను ఒకసారి ఫల్గుణ వచ్చి నాకు జ్వరం వచ్చి కూడా తన దగ్గరికి రాలేదని అమ్మ చెప్పేసరికి నిశ్చేష్టుడిలా నిలబడిపోయాడు. నేను వాడిని పరాయి వాడిగా చూస్తున్నట్టు అనిపించి కాబోలు చేతిలో స్టెతస్కోపు నేలమీద విసిరికొట్టి గిర్రున తిరిగి వెళ్ళిపోయాడు నేను దాన్ని జాగ్రత్తగాతీసి చిలక్కొయ్యకి తగిలించాను నేను కష్టపడి వాడికి చదువు చెప్పించినా ఏనాడు వాడి దగ్గరికి వైద్యం కోసం వెళ్ళలేదు ఫల్గుణ ఎంత కుమిలిపోతాడో తెలిసినా నేను లక్ష్యపెట్టలేదు

మధ్యాహ్నానికి బాగా జ్వరం వచ్చేసింది రెండుసార్లు వాంతులు అయినాయి. మధ్యాహ్నం



శశి, ప్రకాష్ వచ్చారు ప్రకాష్ వెళ్ళి ఫల్గుణకి ఫోన్‌చేసి వచ్చాడు నేను మీనాని పిలిచి డాక్టర్ కృష్ణకుమారి కోసం పంపించాను డాక్టర్ వచ్చింది

అమ్మ ఏడుస్తూ "ఇదేం ఖర్మ డాక్టర్! రోజూ జ్వరం వస్తోంది" అంది

డాక్టర్ స్టూల్‌మీద కూర్చుని నన్ను పరీక్ష చేసింది "సంధ్యా! నీకు మానసికంగా మార్పు రావాలేకాని, ఏ మందులకీ కూడా ఈ జబ్బు నయం కాదు" అంది ఈ మాట నాతో చాలాసార్లు అంది

ఇంతలో ఫల్గుణ పరిగెత్తుకుంటూ వచ్చి డాక్టర్ కృష్ణకుమారిని చూడగానే ఆగిపోయాడు ఆ ముఖంలో చెప్పలేని ఆవేదన పొడచూపింది నా మంచం చుట్టూ అందరూ నిలబడ్డారు హాయంత్రం అవుతోంది అయినా నాకు ఊపిరాడనట్టు ఉక్కిరి బిక్కిరి అవుతున్నాను

"డాక్టర్ ఎలా ఉంది?" అందరూ అడుగుతున్నారు

కానీ అందులో ఏ ఒక్కరూ నా కోసం ఆలమటించేవాళ్ళు లేరు నేను కావాలనుకునే వ్యక్తి లేడు ఎల్లుండే కిరణ్ బొంబాయి వెళ్ళిపోతున్నాడు తర్వాత అటునుంచి అటే అమెరికా వెళ్ళిపోతాడు నేను హఠాత్తుగా వెక్కి వెక్కి ఏడుస్తున్నాను

"సంధ్యా! సంధ్యా!" గాభరాగా పిలిచింది కృష్ణకుమారి

"డాక్టర్ నేనీ నరకం భరించలేను నాకు చచ్చిన ప్రాణంపొయ్యే మందేదైనా ఉంటే ఇవ్వండి డాక్టర్!" అన్నాను ఏడుస్తూ

"ఛ! ఏం మాటలవి?" ఆవిడ మృదువుగా కసిరింది

"మీకు తెలీదు డాక్టర్ నేనీ ఒంటరితనం భరించలేకుండా ఉన్నాను నాకెవ్వరూ లేరు డాక్టర్"

"వీళ్ళంతా నీవాళ్ళు కారా?" ఆవిడ అందర్నీ చూపిస్తూ చిరుకోపంగా అంది

నేను బలహీనంగా నవ్వాను "నాకీ ప్రపంచంలో నాకోసం అనుక్షణం తాపత్రయపడే వ్యక్తులు ముగ్గురే డాక్టర్" అన్నాను

"ముగ్గురేనా!" ఆవిడ నమ్మలేనట్టుగా అడిగింది

"అవును డాక్టర్ నా ప్రాణస్నేహితురాలు

# జీవితవనంలో కొత్తగాలి

ప్రమీల నేను ప్రాణప్రదంగా ప్రేమించిన నా కిరణ్"

"మూడో వ్యక్తి"

అమ్మ ఊపిరి బిగబట్టి నన్నే చూస్తోంది నేను నా తలని ఒడిలో పెట్టుకుని కూర్చున్న మీనా చెంపలు ఆప్యాయంగా రాస్తూ —

"నా ముద్దుల చెల్లి ఈ మీనా డాక్టర్" అన్నాను మీనా కళ్ళనుండి కన్నీళ్ళు జారి నా చెంపల మీద పడ్డాయి అమ్మ ముఖం పాలిపోయింది

"అంతా నీ పిచ్చి ఆలోచన సంధ్యా" ఆవిడ మందలింపుగా అంది

"ఏ డాక్టర్! నేను ఎంత దుర్మార్గురాలినో తెలుసా డాక్టర్ పండంటి నా కిరణ్ జీవితాన్ని నాశనం చేశాను హాయిగా, ఆనందంగా, పదిమందికీ ఆదర్శంగా ఉండాల్సిన కిరణ్ నా మూలంగా ఇష్టం లేని పెళ్ళి చేసుకుని, ఆవిడని పోగొట్టుకొని దేశాలు పట్టి పోతున్నాడు డాక్టర్ ఇది ఎంత నరకం డాక్టర్ నేనేం చేయగలను బాధ్యతలు, బంధాలు అంటూ ఇన్ని సంవత్సరాలు గడిపేశాను ఇక నా జీవితానికి విశ్రాంతిలేదు డాక్టర్ నేను బ్రతకటం కూడా దండగే నేనిక బ్రతకను నా గుండెల్లో బద్దలవుతున్న అగ్నిపర్వతాలు ఎవరికి తెలుసు" అని ఈ రోజు అందరిముందూ బయటపడిపోయాను

"సంధ్యా! సంధ్యా! ప్లీజ్ ఏడవకు నువ్వు నిండుగా నూరేళ్ళు బ్రతుకుతావు" అంది డాక్టర్

నేను నవ్వాను "ఎందుకు డాక్టర్ ఈ నరకయాతన ఇంకా డెబ్బయి సంవత్సరాలా!" ఫక్కున తెరలు తెరలుగా నవ్వేసింది

తర్వాత నెమ్మదిగా అన్నాను — "డాక్టర్ నేను నూరేళ్ళు నిజంగా బ్రతికితే నా ముసలితనంలో ప్రమీల దగ్గరికి వెళ్ళిపోతాను నేను నా కిరణ్ దగ్గరికి ఎలాగూ వెళ్ళలేను అది అసంభవం నన్ను కంటి రెప్పలా చూసుకుంటుంది ప్రమీల" అన్నాను అందరి ముఖాలు వెల్లబడిపోయాయి నాకూ, వాళ్ళకి ఎన్ని వందల మైళ్ళ దూరం ఉందో ఇప్పుడే తెలిసినట్టుగా అందరూ మౌనంగా ఉండిపోయారు



హైద్రాబాదులోని శ్రీ త్యాగరాయ గానసభ [చిక్కడపల్లి] ఆధ్వర్యంలో భరతనాట్యప్రదర్శన యిచ్చిన ఉస్మానియా మెడికల్ కాలేజి విద్యార్థిని, అడ్వకేటు శ్రీ సి పి సారధి గారి కుమార్తె కుమారి సి సురేఖ

నేనేదో అనబోతుండగా ప్రమీల గాలి దుమారంలా వచ్చింది

"ప్రమీ" నేను ఆనందంగా రెండు చేతులు చాచాను

ప్రమీల తలమీద మఫ్లర్ ఉంది పచ్చి బాలింత అయినా వచ్చింది వస్తూనే "మై గాడ్ ఇదేమిటి ఇలా నిలబడ్డారు ఆమెకి ఉక్కపోసేస్తోంది" అంటూ ఫ్యాన్ వేసి నా మంచంమీద కూర్చుని నాకు అటూ ఇటూ చేతులు వేసి —

"ఏమిటే సంధ్యా అలా ఉన్నావు ఫోన్ చేస్తే ఫల్గుణ భార్య సంధ్యకి జ్వరంట అని చెప్పింది అందుకని బాబుని అమ్మ దగ్గర వదిలి వచ్చాను" అంది

"పచ్చి బాలెంతరాలివి ఇలా రావచ్చా" అన్నాను కోపంగా

"ఏం పర్వాలేదోయ్ డాడీ కారు కొన్నారు కార్లో వచ్చాను. ఇంతలోకి నేనేం అరిగిపోలేనులే" అని,

"డాక్టర్! ఏమిటి కండిషన్" అంది

నేను ప్రమీల చేతిని నిమురుతూ "ప్రమీ! నేను నీ దగ్గరకి వచ్చేస్తాను రమ్మంటావా?" అన్నాను

"నాన్సెన్స్ దీనికి పర్మిషన్ అడుగుతున్నావా" అని కసిరింది

"ఇదే డాక్టర్ నా జీవితంలో నవ్వులజల్లు ఈ అమ్మాయే లేకపోతే నేనేనాడో వైకుంఠయాత్రకి వెళ్ళేదాన్ని" అన్నాను

"ఇదో పిచ్చిమాలోకం" అంది కోపంగా ప్రమీల

"ప్రమీ కమల్‌ని తీసుకురాలేదేం" అన్నాను



ప్రమీలముఖం గంభీరంగా అయింది "అన్నయ్య వాడిని తీసుకుని రాజేంద్రన్నయ్య దగ్గరికి వెళ్ళాడు మధ్యాహ్నం" అంది.

"కిరణ్ రేపే కదూ వెళ్ళిపోయేది?" అన్నాను.

ప్రమీల తలూపింది నా గుండెల్లో అగ్ని రాజుకుంటోంది.

ప్రమీల "మీనా నాకో కప్పు కాఫీ ఇవ్వు ?" అంది. మీనా వెళ్ళిపోయింది. డాక్టర్‌తో ఆ కబురు, ఈ కబురూ చెబుతోంది. మీనా అందరికీ కాఫీ తెచ్చింది. ప్రమీల నాకు టాబ్లెట్ వేసింది. కాఫీ తాగించింది.

"ఇక వెళ్ళొస్తాము. ఇంటి దగ్గర సంధ్య ఏడుస్తుంది" అంది లేస్తూ.

"సంధ్య ఎవరు !" కృష్ణకుమారి ఆశ్చర్యంగా అంది.

"ఓహ్! సారీ! నా కూతురి పేరు సంధ్యారాణి. అది మా కిరణ్ అన్నయ్య, మావారు ఏకగ్రీవంగా ఎన్నిక చేసిపెట్టారు" అని నన్ను చూసి నవ్వింది.

నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అందరూ నిశ్శబ్దంగా బయటికి వెళ్ళిపోయారు. ప్రమీల చిలక్కొయ్యకి ఉన్న బ్యాగ్‌లో డబ్బుతీసుకుని డాక్టర్‌కి ఫీజు ఇచ్చేసింది వెళ్ళబోయే ముందు తటపటాయింపుగా నా వైపు చూసి –

"నువ్వు ఇంకేమైనా చెప్తావా ?" అంది.

నేను ఏదో చెప్పబోయి ఏమీ లేదన్నట్టుగా తలూపాను.

ప్రమీల నిట్టూర్చి "రేపు సాయంత్రం అన్నయ్య వెళ్ళిపోతున్నాడు" అంది.

నేను పెదవి కొరుకుతూ దుఃఖాన్ని ఆపుకోడానికి శతవిధాలా ప్రయత్నం చేస్తున్నాను.

"సరే !" అని ప్రమీల వెళ్ళిపోయింది

బయట ప్రమీల కారు వెళ్ళిపోయిన చప్పుడయింది. నేను భారంగా కళ్ళు మూసుకున్నాను.

## 37

మర్నాడు :

నేను పిచ్చెక్కినదాన్నిలా మంచంమీద పడుకుని గోడమీద అద్దుని చూస్తున్నాను. కిరణ్ వెళ్ళిపోయే సమయం దగ్గర పడుతున్నకొద్దీ నాకు మతి పోతున్నట్టుగా ఉంది. ఆఫీసుకి సెలవు పారేశాను. ఈ ఫళాన పరిగెత్తుకుంటూ వెళ్ళి 'కిరణ్ నీ బిడ్డకు తల్లి నవుతాను, నన్ను ఒంటరిగా ఒదిలిపోకు' అని అరిచి చెప్పాలనిపిస్తోంది.

ఇంతలో అమ్మ గదిలోకి వచ్చి "సంధ్యా టాబ్లెట్ వేసుకున్నావా ?" అంది. నేను వేసుకోలేదన్నట్టుగా తలూపాను.

"అరే" అంటూ అమ్మ టేబుల్ దగ్గర కెళ్ళింది. ఇంతలో అమ్మ కెవ్వున అన్నట్టు "సంధ్యా" అంది బిగ్గరగా.

నేను ఉలిక్కిపడి "ఏమిటి ?" అన్నాను.

అమ్మ ఏదో కవరు తెస్తూ "నాలుగు రోజుల క్రితం నీకు ఉత్తరం వచ్చింది. నేనా సంగతే మర్చిపోయాను" అంది అంగిస్తూ.

నేను చప్పున కవరు చూసి నిశ్చేష్టురాలినైపోయాను. అది నాకు ఎంతో సుపరిచితమైన దస్తూరి.

"అప్పుడే న కెందుకు ఇవ్వలేదు" అన్నాను కోపంగా.

"ఆ రోజు నువ్వు, శశీ పోట్లాడుకుంటిరి. మర్నాడు నువ్వు లేవు. ఆదివారం ఆ పిల్లాడితో ఉదయాన్నే ఎక్కడికో వెళ్ళావు. నిన్న బారసాలకి వెళ్ళి అక్కడ గొడవయి ఇంటికొచ్చి జ్వరంతో పడుకుంటివి. నాకసలు ఈ గొడవల్లో గుర్తేలేదు" అమ్మ భయం భయంగా అంది

నేను అప్పటికే కవరు చించాను. అందులో ఇలా ఉంది –

నా సంధ్యా !

నిన్నిలా పిలిచే అధికారం ఇప్పుడు నాకు ఉందనే అనుకుంటున్నాను. శాపవశాత్తూ భార్యాభర్తలుగా జీవితం గడపాల్సిన మనం చెరోవైపుగా చీలిపోయాం. కమల పోయింతర్వాత నాకు నిజంగా జీవితంమీద విరక్తి కలిగింది. ఇన్ని సంవత్సరాలకి ఇండియా తిరిగివచ్చి, బాబుని, నిన్నూ చూసి నా గుండె ద్రవించిపోయింది. ఏం చేసినా, ఎన్ని ప్రదేశాలు తిరిగినా నాకు మనశ్శాంతి లేదు. నా తృప్తి, ఆనందం, సరదాలు అన్నీ నీతోనే అని ఎప్పుడో అన్నాను. అది నిజం సంధ్యా. నిన్ను ముఖాముఖి అడిగే ధైర్యం ఎందుకో నాకు కలగలేదు ఆ రోజు మూడు సంవత్సరాల తర్వాత అలా చూస్తుంటే నాకు కలిగిన ఆనందం ఇంతవరకూ కలగలేదు

ప్రమీల ద్వారా నీ కుటుంబ విషయాలు అన్నీ విన్నాను. ఒక రకంగా నువ్వు, ఇంకో రకంగా నేను ఇద్దరం జీవితంలో ఓడిపోయాము. ఎన్నెన్నో కలలు కని చివరికి అవన్నీ గంగలో కలిపేసి ఇంత కాలం బ్రతికాము.

నేను కమలతో ఆనందంగా గడపలేదని, ఆ అమ్మాయిని మోసం చేశానని ఎన్నడూ అనుకోవద్దు. ఎంతగా ప్రయత్నించినా నిన్ను మరిచిపోలేక, ఒకరకంగా అసంతృప్తిగానే ఫీలయ్యేవాడిని సంధ్యా కమలలాంటి అమ్మాయి భార్యగా లభించటం చాల అదృష్టం సంధ్యా. కానీ ఆ అమ్మాయి దురదృష్టవశాత్తూ అంత సంపూర్ణమైన సుఖాలు పొందలేదని నేను ఒప్పుకోక తప్పదు సంధ్యా.

అమ్మని కన్న తల్లిలా చూసేది. నా గదిలో నీ చిత్రాన్ని చూసి ఏమాత్రం ఈర్ష్య లేకుండా నన్ను తన మాటలతో లాలించేది. ఆ మాటలు నాకెంతో ధైర్యాన్నిచ్చేవి. ఆ మాటలు తలుచుకుంటే ఇప్పటికీ నాకు కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి సంధ్యా

బెంగుళూర్‌లో హోటల్ రూమ్‌లో ఈ రాత్రి కూర్చుని నా మనస్సు నీ ముందు పెడుతున్నాను సంధ్యా. నీ జీవితం అలా అడవికాచిన వెన్నెలలా అవుతుంటే... నో... నేను సహించలేను. నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను సంధ్యా. నీకు బాబంటే ప్రాణం. నాకు నువ్వంటే ప్రాణం. నా మాట కాదనవని నా కెందుకో గాఢనమ్మకం సంధ్యా నేను హైదరాబాద్ రాగానే మీ ఇంటికి వస్తాను నీ అంగీకారం నువ్వు నీ నోటిద్వారా నాకు చెప్పాలి

నేను నిండుమనసుతో నిన్ను నా జీవితంలోకి ఆహ్వానిస్తున్నాను. ఈసారి నువ్వు నా జీవితాన్ని ఏ మలుపు తిప్పుతావో నిర్ణయం నీకే వదిలేస్తున్నాను. సంధ్యా ! మూడు సంవత్సరాలుగా నేను పడే ఈ నరకం నీ నీడలో మర్చిపోవాలి. మృదువైన నీ మాటలు నాకు ఎంత స్వాంతనిస్తాయో నీకు తెలుసా ? నా మాట కాదనవనే గాఢ విశ్వాసంతో

నీ

కిరణ్.











నేను నిశ్చేష్టురాలినైపోయాను. మై గాడ్ కిరణ్ పెట్టిన గడువు ఏనాడో అయిపోయింది. ఈ కాలం అనేది అతి విలువైనది. ఒకసారి కిరణ్‌ని పోగొట్టుకున్నాను. రెండోసారి మళ్ళీ అతను నాకు అవకాశం ఇచ్చాడు. ఇదికూడా చెయ్యిజారిపోయేలా ఉంది. ఈ రెండుసార్లు అమ్మ నాకు రాహువులా అడ్డు వచ్చింది.

అందుకేనా అతను ఆ రోజు అంత చనువుగా తిరిగాడు నాతో. అందుకే కాబోలు "ఏదైనా చెప్పు! ఏదైనా చెప్పు!" అన్నిసార్లు అడిగాడు. మై గాడ్! మై గాడ్! నాకు ఒణుకు వస్తోంది. ప్రమీల నిన్న సాయంత్రం హఠాత్తుగా అలా రావటానికి వెనక బలీయమైన కారణమే ఉందన్నమాట. వచ్చి వాలెంతవాలు, అందులో వెళ్ళబోయే ముందు—

"ఏమైనా చెప్తావా సంధ్యా!" అన్న మాటల్లో అంతరార్థం ఇదా! నేను చప్పున గడియారంకేసి చూశాను. అంతే! నెత్తిన పిడుగు పడ్డట్టు అయ్యాను. చప్పున లేచి ఒక్క ఉదుటున బ్యాగ్ అందుకుని చెప్పులు వేసుకుని సుడిగాలిలా బయటికి వచ్చాను.

"సంధ్యా! సంధ్యా! ఎక్కడికే ?" అమ్మ, ఉష, శశి పరిగెత్తుకుంటూ వచ్చారు. నేను ఆగ లేదు. రోడ్డుమీద పరిగెత్తుతున్నాను. ఒంట్లో అసలు ఓపికలేదు. ఎలా పరిగెత్తానో గుర్తులేదు. కనిపించిన ఆటో ఎక్కేసి –

"ఆదర్శనగర్ పోనివ్వు" అన్నాను.

ఆటో రయ్యినపోతోంది. మై గాడ్! నా కిరణ్! నేనెంత మూర్ఖురాలిని. కిరణ్‌కి పెళ్ళి అంటే ఇష్టంలేదు అనుకున్నాను. అతను ఆ ఉత్తరం ఎంత ఆర్తిగా రాశాడు. ఇదంతా నా దురదృష్టం.

"తొందరగా పోనివ్వు" అని కసిరాను ఆటో వాడిని.

"ఏం! మాట్లాడుతుంద్రమ్మా మీరు" అని మొదలెట్టాడువాడు.

వెళ్ళిపోయారేమో. నో! నో! వెళ్ళటానికి వీల్లేదు. నా కిరణ్ నాక దక్కాలి. "నా కిరణ్ !" నా మనసు, శూన్యంలోకి చేతులు చాచి ఆక్రోశిస్తున్నాయి. ఆటో ఆగింది. నేను ఒక్క ఉదుటున దిగి లోపలికి పరిగెత్తాను.

## జీవితవనంలో కొత్తగాలి

"అమ్మో! నా డబ్బులు" అని వాడు వెంట బడ్డాడు.

"కిరణ్ !" గట్టిగా అరిచాను.

పనిమనిషి వచ్చింది. "వాళ్ళు ఇమానాశ్రయానికి ఎల్లారమా !" అంది. అందరూ వెళ్ళారనే సరికి నాకు మూర్ఛ వచ్చినంత పనయింది.

రివ్వున వచ్చి ఆటోలో కూర్చుని "త్వరగా పోనివ్వు ఎయిర్ పోర్టుకి" అంటూ చేతికి వచ్చిన ఇరవైరూపాయల నోటు వాడిచేతిలో పెట్టాను. ఆటో రివ్వున దూసుకుపోతోంది. నాకు కళ్ళు తిరుగుతున్నట్లున్నాయి. నేను నిజంగా నష్టజాతకురాలినే. "భగవాన్! తండ్రీ నిన్ను ఏనాడూ నేను నా కోసం ఏం కోరుకోలేదు. నా కిరణ్‌ని నాకు దక్కించు" అని వేడుకోసాగాను

### కర్తవ్యం?

నీ కన్నుల
వెన్నెల వెల్లువదీ ప్రవాహంలో
యీదుకుంటూ
హృదయ సంద్రంలో సంగమించాలని
నా
ప్రయాణం!
నా
భావనల బిగికౌగిట్లో బందీవై,
కలల్నీ
కాలాన్నీ,
జయించాలని –
నీ
ప్రయత్నం!
నా ప్రయాణానికీ, నీ ప్రయత్నానికీ,
నీకూ – నాకూ మధ్య ...
దూరాన్ని పెంచుతూ,
సమస్యల దుమారాన్ని రేపుతూ,
సమాజం! ? ...

— కస్తూరి వాణి

ఒకవేళ ప్లేన్ వెళ్ళిపోయిందేమో! నా కిరణ్! నన్ను అన్యాయం చేయకు! నాకు చప్పున దుఃఖం నరదలా వచ్చేసింది ఆటోవాడు అదిరిపోయాడు నా ఏడుపుకి. ఎయిర్ పోర్టు దగ్గిర పడుతోంది కళ్ళు గట్టిగా తుడుచుకున్నాను. నా గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నాయి శరీరమంతా గాలిలో తేలిపోతోంది.

ఆటో ఆగింది నేను సుడిగాలిలా దిగి పరిగెత్తాను. అందరూ నన్ను వింతగా చూస్తున్నారు. నేను లోపలకి వెళ్ళేసరికి ఒక విమానం ఆకాశంలోకి రివ్వున ఎగిరిపోయింది. అంతే! నా కళ్ళ ముందు మెరుపులు మెరిశాయి "నా కిరణ్ వెళ్ళిపోయాడు" అంతే! నేను కుప్పలా కూలిపోయాను

"సంధ్యా !" అన్న ప్రమీల స్వరం నాకు లీలగా వినిపించింది.

* * *

నేను కళ్ళు తెరిచాను ఎదురుగా ప్రమీల, రఘు, ప్రమీల పిల్లలు. అమ్మా, చెల్లెళ్ళు, సుధాకర్, ప్రకాష్, ఫల్గుణ, వాళ్ళ అత్తగారు, మామగారు, రామారావుగారు, రాధమ్మగారు, డాక్టర్లు అందరూ కనిపించారు. కానీ నాకు కావాల్సిన వ్యక్తి మాత్రం కనపడలేదు.

నేను హఠాత్తుగా వెక్కి వెక్కి ఏడవసాగాను. ఇంతలో మీనా కమల్‌ని ఎత్తుకుని వచ్చేసరికి నేను రెండు చేతులు చాచి "కమల్!" అని లేవబోయాను

"ఆ ... ఆ ... సంధ్యా! లేవకు" డాక్టర్ ఖంగారుగా అంది.

ఎవరిదో బలిష్టమైన చెయ్యి వచ్చి నన్ను వెనక్కి వాల్చి పడుకోబెట్టింది. నాకు ఎంతో పరిచితమైన స్పర్శ అది. చప్పున తల యెత్తి చూశాను. నా మీదికి వంగి నవ్వుతున్నాడు కిరణ్!

"కిరణ్" నేను చప్పున అతని ఒళ్ళో తలదాచుకుని బావురుమన్నాను.

"ఛ! ఛ! లేదు...లేదు. ఏమయిందిప్పుడు. ఏడవకు" అతను మృదువుగా నాతల నిమురుతూ అన్నాడు. భగవాన్ ఆ స్పర్శ ఎంత హాయిగాఉంది. అది నాకు ప్రాణంపోస్తున్నట్టుగా ఉంది. నేను అలా చాలాసేపు ఏడుస్తుండిపోయాను అందరూ బయటికి వెళ్ళిపోయారు.




# ALLWYN

## నిక్కచ్చితనం చక్కదనాల్లో ప్రపంచ ప్రమాణాలనే మార్చి వేసింది సీకో. ఆల్విన్ ఆ బాధ్యతను నిర్వహిస్తూ ఉంది.


ఆటోమాటిక్


క్వార్ట్జ్


హాండ్ వఫుండ్

సీకో ప్రపంచమంతటా అనుసరించేందుకు క్రమం తప్పకుండా ప్రమాణాలను సృష్టించి పెడుతూన్న వాచ్ కంపెనీ నిజానికి ప్రపంచంలోని మొట్ట మొదటి క్వార్ట్జ్ గడియారాన్ని సమర్పించింది సీకోయే

ప్రస్తుతం సీకో ఆల్విన్ సహకారంతో ఇండియాను కాలమాన శాస్త్రపరంగా అత్యాధునిక ప్రపంచస్థాయికి తెచ్చింది

నిక్కచ్చితనంలోనూ, చక్కదనంలోనూ అత్యాధునిక ప్రమాణాలతోటి మెకానికల్, ఆటోమాటిక్, క్వార్ట్జ్ గడియారాల శ్రేణి

ఎంతో ఎక్కువ విశ్వసనీయమైన గడియారాలు – మరింత ఉపయుక్తత శైలిలోనేమి, సాంకేతిక నైపుణ్యంలోనేమి కాలానుగుణ్యమైన గడియారాలు

సీకో, జపాన్ వారి లైసెన్సుతో తయారైన గడియారాలు ఆల్విన్ పేరు మీద అమ్మకం జరుపబడుతున్నాయి

మరి మీరూ కాలానుగుణ్యంగా నడవండి

**ఆల్విన్**
గడియారాలు
లైసెన్సు **సీకో**

కాలం అందుకున్న కొత్త శిఖరం

HTB-HAM-7654




"నాపిచ్చి సంధ్యా! ఎంతగాభరా పెట్టావో తెలుసా?" కిరణ్ ఆప్యాయంగా అన్నాడు

"నువ్వు వెళ్ళిపోయావనే అనుకున్నాను." అన్నాను.

"మేము ఎయిర్‌పోర్టు చేరుకున్నాము. నువ్వు వచ్చావు ముందు ప్రమీలేచూసి సంధ్య వస్తోంది అంటే నేను నమ్మలేదు. తీరా చూద్దునుగదా నువ్వు స్పృహతప్పి పడిపోయావు! ఎంత గాభరా పడ్డానో తెలుసా?" అన్నాడు.

"నిన్ను పోగొట్టుకున్నాననే అనుకున్నాను" అన్నాను వెక్కుతూ. అతను నా తల నిమురుతూ అన్నాడు "నేను అలాగే అనుకున్నాను. నువ్వు ఇష్టపడటం లేదనే అనుకున్నాను. ప్రమీలకూడా చివరికి అదే అనేసరికి నేను ఎంత షాక్ తిన్నానో తెలుసా? నాకేం తెలుసు నీకు ఉత్తరం అందలేదని" అన్నాడు

"ఇక జీవితంలో నిన్ను చూడననే అనుకున్నాను. నేను నిన్ను అడుగుదాం అనుకుంటూనే అడగలేకపోయాను."

"దేవుడికి ఇప్పటికైనా మనమీద దయకలిగింది సంధ్యా! ఇంకో అరగంట ఆలస్యమైతే... ." అతను చప్పున ఆపేశాడు.

"నిజం ..." అన్నాను మెరుస్తున్న కళ్ళతో.

కిరణ్ నా ముక్కు పట్టి ఊపాడు

"కిరణ్ మరి మీనా పెళ్ళి.. "అర్ధోక్తితో ఆగిపోయాను.

"మనమే చేద్దాం! మీ అమ్మ నీగురించి ఎంత బాధపడిందో ఎంతగా ఏడ్చిందో నీకు తెలీదు నువ్వు మీ అమ్మతో మామూలుగా మాట్లాడతానని నాకు వాగ్దానం చెయ్యి" అన్నాడు చెయ్యి చూస్తూ.

నేను చేతిలో చెయ్యివేశాను. అమ్మ ఆ ఉత్తరం అప్పటికైనా ఇవ్వకపోతే నేను కిరణ్‌ని ఇలా చేరుకునే దాన్నేనా ? నా ఒళ్ళు గగుర్పొడిచింది

* * *

మా పెళ్ళి గుళ్ళో జరిగిపోయింది. ప్రమీల ఆనందం అంతా ఇంతా కాదు. మా ఆఫీస్ స్టాఫ్ అంతా వచ్చారు. మెడ్రాస్ నుంచి సుగుణ వచ్చింది. అన్నిటికంటే ఆశ్చర్యం రాణి నాతో చనువుగా ఉండటం.

"మా నాన్న ఎలాంటివారో చూడు వదినా. మీ తమ్ముడికి డిస్పెన్సరీ సెపరేట్‌గా కట్టిస్తానన్నాడు. మా బాబుకి మెళ్ళో గొలుసు, ఉంగరం

# జీవితవనంలో కొత్తగాలి

అవన్నీ చేయిస్తానన్నారా వదినా. మావదిన మా డాడీ మీదికి గయ్యిన లేచింది "డబ్బంతా నాకు దోచి పెడుతున్నారు!" అని నానామాటలంది" అంది కళ్ళు తుడుచుకుంటూ.

"పోనివ్వు రాణీ" అన్నాను బుజ్జగిస్తూ

"అంతేకాదు వదినా నేను వెళ్ళి మా డాడీని అవి ఎప్పుడు చేయిస్తావు అని అడిగితే అంతెత్తున లేచి "నాదగ్గర చిల్లిపైసా లేదు" అన్నారు మీరేగా చేయిస్తానన్నారు అంటే "నువ్వు మీ అత్తగార్ని పీక్కు తిన్నట్టే నా కోడలు కూడా నన్ను పీక్కు తింటోంది." అని కసిరారు" అంది.

నిజమే. ముందు ఆదరించి తర్వాత కసిరికొడితే బాధకదూ. నేనూ, కిరణ్ అమ్మకి వంగి నమస్కారం చేశాము. అమ్మ నన్ను కావిలించుకుని బావురుమంది.

నేను ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాను. నా బట్టలు అవీ సర్దుకున్నాను. మీనా పేరుమీద నా డబ్బంతా బాంకులోవేసి ఫల్గుణ చేతిలో పెట్టాను ఫల్గుణ కళ్ళలో నీళ్ళుతిరిగాయి నేను ఆప్యాయంగా వాడి భుజం తట్టాను జీవితవనం జాగ్రత్తగా పెట్టోసర్దాను నేను.

## మార్పు

అరగదీసిన కొలది
సుగంధాన్నిస్తుంది
గంధం

సానపెట్టిన కొలది
మెరుగునిస్తుంది
వజ్రం

విరిసిన కొలది
సువాసనిస్తుంది
పుష్పం

చట్టాలు చేసిన కొలది
అడ్డదార్లు వెతుకుతున్నాడు
మనిషి

— శ్రీవాణి

38

రైలు కదిలింది ప్లాట్‌ఫామ్ దాటేవరకూ మేము గుమ్మంలోనే ఉన్నాము. అందరూ చేతు లూపుతున్నారు. ఇద్దరము వచ్చి కూర్చున్నాము. నేను బాబుని ఒళ్ళో కూర్చోబెట్టుకుని "ఒరేయ్ కమల్ డాడీ అని పలకరా" అన్నాను.

"డాడీ" అన్నాడు నవ్వుతూ

"మమ్మీ అను"

"మమ్మీ" అన్నాడు చిలకలా

నేను గర్వంగా కళ్ళెగరేశాను. అతను చిరునవ్వుతో మా ఇద్దరినీ చూస్తున్నాడు నాకు జ్వరం తగ్గి ఎంత ఉత్సాహంగా ఉన్నా నీరసం వదట్టుకపోలేదు. నేను వెనక్కివాలి కిరణ్ ఒళ్ళో తలపెట్టుకుని పడుకుని కమల్‌ని నా పొట్టమీద కూర్చోబెట్టుకున్నాను

"ఏమిటి కిరణ్ సీరియస్‌గా ఉన్నావు" అన్నాను

"ఇదంతా . కలా . . నిజమా అనిపిస్తోంది" అన్నాడు.

"కలలాటి వచ్చి వాస్తవం" అన్నాను.

"నువ్వు నిజంగా అసలు సంధ్యవేనా అనిపిస్తోంది".

"నువ్వు నిజంగా కిరణ్‌వే అయితే నేను నిజంగా సంధ్యనే" అన్నాను కొంటెగా. అతను నా ముక్కు పట్టి ఊపుతూ —

"నువ్వు ఎప్పుడూ నవ్వుతావుచూడు అలానవ్వు" అన్నాడు. నేను మూతి బిగించుకోబోయి సాధ్యంకాక పకాపకా నవ్వాను. అతనూ శృతి కలిపాడు మా యిద్దర్నీచూసి బాబు నవ్వాడు, చప్పట్లు కొడుతూ

రైలు వేగంగా పరుగులు తీస్తోంది. ఇద్దరం ఏదో చెప్పుకుంటూ నవ్వుకుంటూనే ఉన్నాము చల్లటిగాలి, తాజాగ సున్నితంగా మమ్మల్ని తాకి వెడుతోంది. కిరణ్ నాకు సృష్టించిన జీవితవనంలోకి నేను అడుగు పెట్టాను. అందులో మేము హాయిగా ఆనందంగా గడపబోతున్నాము. తాజాగ వీచే ఆ గాలి నాకు కొత్తగా అనిపిస్తోంది. నేను ఏనాడూ అనుకోలేదు నా జీవితవనంలో కొత్త గాలులు వీస్తాయని. నేను తృప్తిగా ఆ కొత్తగాలిని పీలుస్తూ మా జీవితవనంలోకి సీతాకోకచిలుకలా విహారానికి వెళ్ళిపోయాను.

*(అయిపోయింది)*



# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం

ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే ! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు **పూర్తి** రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి **పూర్తి రక్షణ** ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత '



## మార్గదర్శి

చిట్‌ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001

శాఖలు: ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్

KIRON/MCF/81/1

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

# వనితలకె మంచి అవకాశం!

## జంట నగరాలలో

# వనితల సమస్యలు

హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాలలో వనితాలోకం ఎన్నోరకాల సమస్యలు ఎదుర్కొంటోంది.

వీటిని నలుగురి దృష్టికి తీసుకువస్తే అవి పరిష్కారం అయ్యే అవకాశాలు అధికం అవుతాయి.

ఇప్పటికే ఆంధ్రపత్రికలో వనితావాణి, విద్యారంగం — నేటి సమస్య, మావూరి సమస్య వంటి శీర్షికల ద్వారా ఎన్నో రకాల 'సమస్యలకి చర్చావేదికలు ఏర్పాటు చేశాము.

దాదాపు ఇరవై లక్షల జనాభా గల జంట నగరాలలో నివసించే వనితలకోసం ఒక ప్రత్యేకమైన శీర్షిక ప్రారంభిస్తే బాగా ఉంటుందని **జంట నగరాలలో వనితాలోకం సమస్యలు** అన్న శీర్షికని మొదలు పెడుతున్నాము.

ఈ కొత్త శీర్షిక హైదరాబాదు, సికిందరాబాద్‌లలో నివసించే వనితలకి మాత్రం పరిమితం అయి ఉంటుంది.

జంట నగరాలలో వనితలు ఎన్నో సమస్యలు ఎదుర్కొంటున్నారు.

ఏ సమస్యని గురించి అయినా సరే వనితలు తమకు తోచినది రాసిపంపాలని మా కోరిక.

రచనలు 500 నుంచి 1000 అక్షరాల దాకా ఉంటే బాగా ఉంటుంది. ఇంతకి మించిన వాటిని వెయ్యటం కష్టం!

రాజధానిలోని వనితా లోకం ఈ కొత్త శీర్షికలో ఉత్సాహంతో పాలుగొని దానిని విజయవంతం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

ప్రచురించిన ప్రతి రచనకీ రు. 15 లు పారితోషికం పంపుతాము.

రచయిత్రులు తమ రచనలతో తమ ఫొటోలు కూడా పంపితే రచనలతోబాటు వాటిని వెయ్యగలము, ఫొటో వెనుక రచయిత్రి సంతకం ఉండాలి.

**ని బం ధ న లు :**

- ★ రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే, కాగితానికి ఒకవయిపు మాత్రమే సిరాతో రాసి ఉండాలి.
- ★ రచనలు సంపాదకుడు, ఆంధ్రపత్రిక, బషీర్‌బాగ్, హైదరాబాద్ - 29 కి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు.
- ★ రచనలతో బాటు తమ స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజీ కలిగిన కవరులు జతపరచిన వారికి ప్రచురణకి స్వీకరింప బడని రచనలూ, ఫొటోలు తిప్పి పంపగలము.
- ★ తుది నిర్ణయం సంపాదకునిదే ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపటానికి వీలు ఉండదు.
- ★ రచనలు పంపే కవరు మీద స్పష్టంగా "జంట నగరాలలో వనితాలోక సమస్యలు" అని రాసి ఉండాలి.
- ★ ప్రతి రచనలోను ఈ క్రింది కూపను జతపరచాలి కూపను జతపరచని రచనలు ప్రచురణకి పరిశీలించటం జరగదు. వ్రాత ప్రతిమీద సయితం రచయిత్రి పేరు, పూర్తి చిరునామా రాసి ఉండాలి.

పేరు : ................................................................

పూర్తి చిరునామా : ................................................

................................................................................

................................................................

................................................

రా. వ. స.




# రంగుటద్దాలు

పాలగిరి వేణు
" శర్మిల

ఎంత వద్దన్నా విన్లేదు రావుగారు ... భోజనం చేయకుండా వెళ్ళకూడదన్నాడు ...

"అయ్యో! రాత్రి పదిన్నర బస్సుకు వెళ్ళాల్సిందే!.. మా ఆఫీసువాళ్ళు ఆ బస్సుకు సీటు కూడ 'రిజర్వు' చేయించారు ... నే వెళ్ళాల్సినపని ఎలాంటిదో మీకు తెలుసు..." అని అంటున్నా వినకుండా వాళ్ళావిడకు ఏవేవో పురమాయించి వంట చేయించారు రావుగారు.

భోజనం చేశాననే దానికన్నా 'కతికి' బయల్దేరాననడం సబబు. రూం చేరుకుని, సామానన్నీ ప్యాక్ చేయించి, హోటల్ బిల్లు చెల్లించి, ఆటోలోపడి బస్సు స్టేషన్ చేరుకునే సరికి, సరిగ్గా పదిన్నరయింది.

బస్సు స్పాటులో లేదు. అక్కడే వున్న కంట్రోలర్‌ను అడిగాను.

కంట్రోలర్ 'సై' సర్దుకున్నాడు. కోటు సరిచేసుకున్నాడు. చెవిలో ఓ అగ్గిపుల్లను దూర్చి కెలుకుతున్నాడు. అయినా ముఖంలో "ప్రజాసేవయే మా కర్తవ్యం" అంటూ ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

"ఏం?" అన్నట్టు చూశాడు.

"ఫెర్టిలైజర్ సిటీకి వెళ్లే బస్సు వెళ్ళిపోయిందాండీ!" అంటూ నెమ్మదిగా అడిగాను.

అతడు సీరియస్‌గా ముఖం పెట్టాడు ... ఏదో ఛార్టు తీశాడు. చిన్న దగ్గు దగ్గాడు. 'సమ్మర్ క్రాఫ్'ని ఒక్కసారి చేత్తో గట్టిగా రుద్దుకున్నాడు. ఒక్కనిముషం పాటు కళ్ళు మూసుకున్నాడు. నాకేమో కంగారుగా వుంది. నే వెళ్ళాల్సినపని అలాంటిది. అతడు కళ్ళు తెరిచాడు. ఎదురుగ్గా నేనే వున్నాను. అయినా నా చూపంతా చెవిలో వదిలివేయబడ్డ అగ్గిపుల్ల మీదే వుంది

"ఏం?"

"ఫెర్టిలైజర్ సిటీకి వెళ్లే బస్సు వెళ్ళిపోయిందాండీ!" మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.. ప్రక్కన 'ఫోన్' మోగింది... ఫోనెత్తాడు రెండు నిముషాలు కళ్ళు మూసుకునే మాట్లాడాడు. మాట్లాడుతున్నప్పుడు అగ్గిపుల్లను చెవిలో తిప్పుతూనే వున్నాడు కళ్ళు తెరిచాడు.

"ఏం?"

"నా శ్రాద్ధం."

"అయితే ఎంక్వయిరీలో అడుగు" నా ముఖాన ఫెళ్ళుమని యిచ్చినట్టయ్యింది ఆ జవాబు.

అక్కణ్ణించి ఏవగింపుగా ఎంక్వయిరీ వైపు కదలబోయాను. అక్కడే బీడీ కాలుస్తున్న ఓ పోర్టరును బస్సు గురించి వాకబు

చేశాను. "బస్సు యింకా వేళ లేదు. ఇంకో అరగంటకుగాని వెళ్ళదు" అంటూ ఖాండ్రించి వుమ్మేశాడు. గారంగా జరిగి అలవాటుగా థ్యాంక్స్ చెప్పాను. మెన్షన్ నాట్ అంటూ ఆ మహాశయుడు "అయ్యా! నేను కూడా మీలాంటి ప్రయాణీకుణ్ణే. వే వెళ్ళాల్సింది గోదావరి ఖనికి" అంటు మళ్ళీ ఖాండ్రించ బోయాడు. భయపడి దూరంగా వెళ్ళి ఓ బెంచీమీద కూలబడ్డాను. ప్రక్కనే ఓ కుర్రాడు ఇల్యుస్ట్రేటెడ్ వీక్లీలో మునిగిపోయి వున్నాడు. ఆ మ్యాగజైన్‌లోకి తొంగి చూశాను. అందులో ఓ బూతు పుస్తకం వుంది. ఫోటోలు కూడా మంచి రంజుగా వున్నాయి. ఆ కుర్రాడి ముఖంలో కవళికలు క్షణక్షణానికి మారుతున్నాయి. ఇంకొంచెం దగ్గరకు జరిగాను ఆ కుర్రాడి వైపు... "చూస్తారా!" అంటూ బూతు పుస్తకాన్ని అందించబోయాడు ఆ కుర్రాడు నా బాధను భరించలేక ...

"వద్దన్నాను" నిజంగా చెప్పాలంటే చదవాలనే వుంది. కాని యీ సభ్య ప్రపంచం వుంది చూశారూ! మనల్ని, మన కోరికల్ని కరకర మని నమిలేస్తుంది. ఇంకో రెండు నిముషాలు అక్కడే కూలబడితే బావుంటుం దనుకున్నాను, కాని ఆ కుర్రాడు నా వైపు అదోలా తీక్షణమైన చూపుల్ని నా మీదకు విసిరి, ఆ పుస్తకాన్ని మూసేశాడు టప్పున. ఇకలాభంలేదనుకుని అక్కణ్నించి లేచి కొంచెం దూరంగా కూచున్నాను. తలచుట్టూ దోమలు చెవుల్ని నంజుకు తింటున్నాయి. దోమల్ని తోలుకుంటూ రెండుసార్లు చప్పట్లు కొట్టాను. ఓ ఇరవైమంది దాకా తిరిగి నా వైపు చూశారు. నేను కూడా తిరిగి చూశాను ఎందుకైనా మంచిదని. వాతావరణం ఏంబాగాలేదు. అక్కణ్నించి లేచాను.

నా వాచి చూశాను తల మీదున్న 'హేంగింగ్ క్లాక్'ను చూశాను రెండూ సరిగ్గా పదకొండు గంటలే చూపిస్తున్నాయి. నాకెందుకో సంతోషం కల్గింది. ఎందుకంటే పబ్లిక్ స్థలాల్లో వుండే యీ క్లాక్స్ ఎప్పుడూ సరిగ్గా పని చేయవు కాని యీ క్లాక్ కరెక్ట్‌గా టైం చూపిస్తోంది అంటే సామాన్యమా?...

ఆకలవుతోంది, రావు గారింట్లో ఎందుకు కతికానూ? శుభ్రంగా భోంచేసి వుంటే బావుండేది ప్రక్కనేవున్న స్టాల్లో బిస్కెట్ పొట్లంకొని వేడి కాఫీలో ముంచుకుతిన్నాను.

మళ్ళీ స్పాట్ కొచ్చాను. బస్సు రాలేదు.

'కంట్రోలర్ రూం దగ్గర కెళ్ళాను. ఎదురుగ్గా నల్లటి ముఖంలో పెద్ద పెద్ద మీసాలు...మనిషి భయంకరంగా వున్నాడు. నోట్లో కిళ్ళీ బిగించాడు, సిగరెట్ పొగ గుప్పున వదులుతున్నాడు.

"ఫెర్టిలైజర్ సిటీ కెళ్ళే బస్సు."

"ఎంక్వయిరీలో అడుగు."

ఇంకేం అడగాలో తెలియడం లేదు. అతడేమో మీసాల్ని మెలేస్తూ ఒక నిముషం చేతితోటి కాయితాల్ని తిరగేస్తూ, రెండో నిముషం ఆకాశం వైపు చూస్తున్నాడు. ఆకాశం లేదక్కడ షెడ్డుపై రేకులున్నాయి.

"క్యా! భాయ్ సాబ్!! గోదావరి ఖనీ జానే కా సూపర్ డీలక్స్ బస్ చలే గయ క్యా!" అంటూ అడుగుతున్నాడు ఓ బట్టతల శాల్తీ, అతడి చేతిలో నశ్యం డబ్బా వుంది.

"నయ్! సాబ్!! గోదావరి ఖనీ సే అభీ తక్ బస్ నై ఆయా! ఇదర్ సే ఏక్ ఇస్పెసల్ బస్ దాల్నే కో కంట్రోలర్ సాబ్ దేక్‌రయ్" అంటూ ఆ శాల్తీ చేతిల్లోంచి నశ్యం డబ్బా అందుకున్నాడు. తెలుగు భాష చేసుకున్న పాపానికి నాకు చాల బాధకల్గింది. ఇంకో పది నిముషాలు అక్కడక్కడ తచ్చాడుతూ గడిపాను. టైం చూశాను. పదకొండున్నర చూపిస్తోంది నా వాచీ. హ్యాంగింగ్ క్లాక్ పదకొండే చూపిస్తోంది. అంటే యిందాక పడ్డ సంతోషమంతా గంగలోకి దూకినట్టయింది.

"భోయ్! భోయ్!!" మంటూ ఇష్యకుల నాటి బస్సొక్కటి వచ్చి స్పాట్‌లో ఆగింది.

అంతవరకు ఎక్కడున్నారో జనం ఒక్కసారిగా బస్సును అన్ని వైపు నుంచి ముట్టడించారు. కిటికీల్లోంచి సామాన్లు, తువ్వాళ్ళు విసిరి సీట్లు రిజర్వు చేయించుకున్నారు. కొందరు సొంతం కిటికీల్లోంచే దూరి బస్సుల్లోకి దూరారు నేను ఎలాగో బస్సులోకి చేరాను. ఎలాగో ఏమిటి? తోపుళ్ళకు, తూపుళ్ళకు ఆటోమాటిక్‌గా లోపలికి చేరవేయబడ్డాను జబ్బలు మాత్రం నొప్పెడుతున్నాయి. సూపర్ డీలక్స్ బస్‌కు ఎవరు రిజర్వు చేయించారో వారికే ఈబస్సు అన్నాడు డ్రైవర్ సాబ్. అప్పటికే సీట్లలో కూచుని హాయి ననుభవిస్తున్న వాళ్ళు, యిటు ప్రభుత్వాన్ని అటూ కార్పొరేషన్ను తిట్లతో దుమ్మెత్తిపోసారు. కొందరు మేము దిగమని ఏంచేస్తారో చేయండని అలాగే సీట్లలో భీష్మించుకు కూచున్నారు. డ్రైవరుసాబ్ అందరికి తలో విధంగా నచ్చచెప్పి, రిజర్వు చేయించని వాళ్ళను దింపి, బస్సును బయల్దేరించేసరికి యింకో అరగంట దాటింది.

నా పక్కన విండో సీటు ఖాళీగా వుంది. 'రాణిగంజ్'లో ఆ ప్యాసింజరు ఎక్కుతాడన్నారు డ్రైవరుగారు. అతడు రాకపోతే 'విండోసీట్లో' కూచుని అలా జారగిలబడి కళ్ళు మూసుకుని విశ్రాంతి తీసుకోవచ్చు. బస్సు కదిలింది. అలా కదిలిందో లేదో ఎవరోవచ్చి బస్సు తలుపు దబ దబ మని బాదుతున్నాడు. బస్సు ఆగింది. ముందున్న అతను తలుపు తీశాడు.



# రంగుటద్దాలు

అతడు హడావుడిగా బస్సులోకి ఎక్కాడు. పెద్ద బ్రీఫ్‌కేసు, ప్యాక్ చేయబడిన పెద్ద అట్టపెట్టె మాత్రం వున్నాయి రెండు చేతులోను. సీటు వెతుక్కుంటూ వచ్చి నా ప్రక్కసీట్లో కూలబడ్డాడు. బస్సు కదిలింది

అతడి మొహమంతా చెమట్లు నిండాయి. జేబురూమాలుతో తుడుచుకున్నాడు. నెమ్మదిగా హైరానా తగ్గినట్లుంది.

"ఇంతసేపూ రాణీగంజ్ స్టాండులో వెయిట్ చేశానండీ! బస్సు ఎంతసేపూ రాకపోయేసరికి నే ఎదురు వచ్చాను ఆటోలో" అంటూ ఆయాసంగా చెప్తున్నాడు అతను నాతో.

"ఏమయితేనేం? సమయానికి వచ్చారు. ఇంకో సెకను లేటొచ్చినా బస్సు తప్పేది?"

"అవునండీ."

"మీ సీట్లో కూచుంటారా?"

"ఫర్వాలేదు సార్! నేను యిక్కడే కూచుంటాను" అంటూ రాక్‌లో అట్టపెట్టెను, బ్రీఫ్‌కేసును సర్దాడు.

అతడికి ధన్యవాదాలర్పించాను మనసులోనే. విండో సీటు ధర్మం చేయడం చాలా గొప్ప సంగతి, అందులోను రాత్రి ప్రయాణం. సీట్లో తాపీగా కూచుని సిగరెట్ వెలిగించి నాక్కూడా ఆఫర్ చేశాడు. వాసనగమ్మత్తుగా వుంది.

"ఇంపోర్టెడా!"

"అవున్సార్! డన్‌హిల్ కింగ్ సైజ్"

ఇంపోర్టెడ్ లైటర్‌తోనే సిగరెట్‌కు జీవం కలిగించాడు. గుండెలనిండా పొగపీల్చి ఒక్కసారిగా ఒదిలాను బైటకు చాల బావుంది. నేనింతవరకు యిలాంటి సిగరెట్ ముట్టుకోలేదు. సిగరెట్ కాలుస్తూ కిటికీగుండా బైటికి చూస్తున్నాను. టాంక్‌బండ్...రాణీగంజ్ ... కంటోన్మెంటు ఏరియాలోకి బస్సు చేరింది. లైట్లు తీసేశాడు డ్రైవర్. లోపలంతా చీకటిగా వుంది. చల్లని గాలి దూసుకొస్తోంది. కాని చలిగాలేదు.

ముందున్న సీట్లోంచి గురక వినపడుతూ వుంది.

"ఎంతవరకువెళ్తున్నారు? మాష్టారూ?"

"ఫెర్టిలైజర్ పిటీకి. మీరు?"

"నేను కూడ అక్కడికే!"

"ఓహో."

## "సెన్సార్"

అసత్యం, అన్యాయం,
అక్రమం, అధర్మం—
వీటన్నిటినీ
సెన్సార్ చేయించి
'అ' తొలగిస్తే—
మానవత్వం
ఉద్భవిస్తుంది!
సమానత్వం
విరాజిల్లుతుంది!

— కోలపల్లి ఈశ్వరరావు

"ఎఫ్ సి. ఐ. లో పంజేస్తున్నారా?" అని అడిగాను

"లేదండీ! ఈస్ట్‌కోస్ట్ కన్‌స్ట్రక్షన్ కంపెనీలో మేనేజరుగా వుంటున్నాను."

"సివిల్ వర్క్స్!"

"ఔనండీ రెసిడెన్షియల్ క్వార్టర్సు. ప్రస్తుతం ఎనభై లక్షల వర్కు మాది. ఎఫ్ సి ఐ. వాళ్లదే పనంతా. ఈ డిశంబరు కల్లా క్వార్టర్సు కంపెనీ వాళ్లకు హాండోవర్ చేయాలి" అంటూ చెప్తున్నాడు అతడు.

నాకు మూడ్ వచ్చింది ఇంకో సిగరెట్ మొహమాటం లేకుండా అడిగిపుచ్చుకున్నాను. లైటర్‌తో వెలిగించాడు అతను. "ఈ యింపోర్టెడ్ సిగరెట్లు ఎలా సంపాదిస్తున్నారు? నిజం చెప్పమంటారా! నేను యీ సిగరెట్‌ను తాగడం మొదటిసారి చాలా లైట్‌గా బావుంది. ఎక్కణ్ణించి తెప్పిస్తారేమిటి?" అంటూ అతణ్ణి కదిపాను.

"చూడండి! గురువుగారు! మీరు ఏ సెంట్రలెక్సైజుకు సంబంధించినవారు కాదు కదా! నాకు యింపోర్టెడ్ మెటీరియలంటే చాల యిష్టం. ఈ నా బట్టలు, వాచీ, యీ లైటర్, నా కళ్ళకున్న యీ రిమ్‌లెస్ జోడు అన్నీ ఇంపోర్టెడే. మీకు ఎక్కడబడితే అక్కడ దొరుకుతాయి హైదరాబాదులో. పోనీలెండి గాని మీరెక్కడ పంజేస్తున్నారో చెప్పలేదు" అంటూ తన వాక్ప్రవాహానికి ఆనకట్ట కట్టాడు.

నేను పంజేస్తున్న కంపెనీ, జీతభత్యాల గురించి చెప్పాను. "ప్స్" అంటూ చిన్న శబ్దం చేశాడు. అతడు నా పొజీషన్ గురించి తృప్తిపడినట్లు లేదు. అతడి సంపాదన

గురించి నేను అడగలేదు. అయినా ...

"చూడండి గురువుగారూ! నాకు ఓ పదిహేనువందల జీతం, ఫ్రీ క్వార్టర్స్, వచ్చే లాభంలో ఒక శాతం, మరీ బోనస్, ఇంకా పై లాభాలుంటాయనుకోండి" అంటూ ఒకరకంగా సాగదీశాడు.

"మీ కేం అదృష్టవంతులు. మే మూ వున్నాం చూశారూ, మాకొచ్చే సంపాదనలో సంసారం గడవటమే కష్టంగా వుంది యీ రోజుల్లో" అంటూ నా బాధను వెళ్ళబుచ్చాను.

"నాకు ముగ్గురు అమ్మాయిలు, ఫామిలీ ప్లానింగ్‌మీద నాకు నమ్మకం లేదండీ! ... మా ఆవిడక్కూడాను..."

మనిషి అల్లుకుపోతున్నాడు, ఏలాంటి ఆసరా లేకుండానే. మా సంభాషణ తోటి ప్రయాణీకులకు ఏలాంటి యిబ్బంది కలిగించినట్టులేదు. ఎందుకంటే ఎవ్వరూ కూడ విసుగు లాంటిది చూపలేదు.

బస్సు స్పీడుగా పోతోంది. గాలి హోరు ఎక్కువైతే కిటికీ గ్లాసును మూశాను. అతడు ఏదో మాట్లాడుతూనే వున్నాడు.

"మీ ప్రాంతంలో ఎండలు ఎక్కువట గదా!"

"ఎండల్లో నిప్పుల్లో మాడుతున్నట్లుంటుంది. అందుకే నేను ఫ్రిడ్జ్ కొన్నాను. మా రెండోది చూశారూ! 'వింటర్'లో కూడ 'ఐస్ వాటర్' కావాల్సిందే! ఇంట్లో పిల్లలకు గాను 'ఏర్ కూలర్' కొన్నాను. ఇవన్నీ వుండి కూడ ఎండ ధాటికి తట్టుకోలేక పోతున్నాం స్వామీ!"

అతడి సంబోధన మాట మాటకు మారుతోంది. అయినా భరించక తప్పడంలేదు.

బస్సు ఆగింది. డ్రైవర్ బస్సు దిగి కిందికి నడిచాడు.

"దిగండి గురువుగారూ! కాఫీ తాగొద్దాం సిద్ధిపేట వచ్చినట్లుంది" అంటూ అతడు లేచాడు. నేను కూడ లేచాను.

"మేష్టారూ! మీరేం అనుకోకపోతే ఎదురుగ్గా వుంది...రెండే రెండు పెగ్గుల్తో గొంతు తడుపుకుందాం ... నిద్ర బాగా పట్టుతుంది కూడాను ... బస్సు కూడ ఓ పది నిముషాలు ఆగుతుంది..."

తలెత్తి ఎదురుగ్గా చూశాను ... అదో "వైన్ సెంటర్."

"క్షమించండి బ్రదర్! నాకుఅలవాటులేదు. మీక్కావాలంటే వెళ్ళిరండి" అంటూ కాఫీ కోసం క్యాంటిన్ వైపు నడిచాను.

"సారీలేండి" అంటూ నాతోపాటు వచ్చాడు అతడు.

సమోసాలు, కాఫీలు తీసుకున్నాం. బస్సు హారన్ వినిపించింది. మేం ఎక్కాక, బస్సు బయల్దేరింది.

"గెష్ట్ హౌస్ వుందిగా..."

"గెష్ట్ హౌస్ ఎందుకండీ! మా యింట్లోనే దిగొచ్చు మీరు."

"అబ్బే! మీకెందుకండి శ్రమ..."

"భలేవారు...గెష్ట్ హౌస్‌లో మీకు 'రూం' దొరక్కపోవచ్చు కూడానూ ... మా యిల్లు చాల పెద్దది...మీక్కావాల్సిన సదుపాయాలన్నీ వున్నాయి..."

"థాంక్స్..."

కళ్ళు మూసుకున్నాను ... నిద్ర పట్టడం లేదు...

బస్సు మాంచి స్పీడుగా వెళ్తోంది ... ఎదురుగ్గా లారీలు! మరీ వేగంగా...తప్పుకుంటూ సునాయాసంగా వెళ్తోంది బస్సు.

అతడు నిద్రలోకి జారినట్టున్నాడు. ఏలాంటి చలనం కూడా లేదు. సన్నని గురక వినిపిస్తోంది. నే వెళ్ళాల్సిన పని గురించి ఆలోచిస్తూ అలా కళ్ళు మూసుకున్నాను. అలాగే నిద్రలోకి...

బస్సు ఎక్కడెక్కడో ఆగినట్లుంది. సరిగా మెలకువ రాలేదు. మగతగా వుంది.

బస్సు ఫెర్టిలైజర్ సిటీ చేరేసరికి ఉదయం ఆరుగంటలయ్యింది. బస్సు ఆగుతూనే అతడు కళ్ళు తెరిచాడు. రాక్‌లోంచి తన సామాన్లు తీసుకుంటూ ఒక్కసారిగా నా మొహంలోకి చూసి హడావిడిగా బస్సు దిగి వెళ్ళిపోయాడు. నే నెందుకో నవ్వుకున్నాను. ఎంతో స్నేహంగా పలకరించాడు, కలుపుగోలుగా మాట్లాడాడు, తనేమాటలుకలిపి... మరిక్కడ? బస్సు దిగుతూనే కనీసం మాట వరుసకైనా చెప్పా పెట్టకుండా వెళ్ళిపోయాడు. అతని నైజం నాకెలాగో అనిపించింది. చూద్దాం. రేపైనా కలవకుండా పోతాడా? అప్పుడు?

ఎవడో కూలీనెత్తిన సామాను పెట్టి గెస్ట్‌హౌస్ చేరుకున్నాను. గెస్ట్‌హౌస్ చాలా బావుంది. సునాయాసంగా రూమ్ దొరికింది. పడకమీద అలా విశ్రమించాను. బాగా నిద్ర పట్టేసింది.

తలుపుమీద టకటకమంటూ చప్పుడైంది. తలుపు తీసి చూశాను గదా! ఎదురుగ్గా అక్కౌంటెంటు రాఘవగారున్నారు.

"రాండి! ఎలా వున్నారు?" అంటూ రాఘవగార్ని రూంలోకి ఆహ్వానించాను.

"ప్రయాణం బాగా జరిగింది కదా!"

"కులాసాగానే జరిగింది."

"ఇంకా విశ్రాంతి తీసుకుంటారా? ... లేక..."

"ఇప్పుడే బయల్దేరుదాం ... స్నానం ముగించుకువస్తాను", ఇంతలో "బ్రేక్‌ఫాస్ట్ తెప్పిస్తాను" అంటూ రాఘవగారు బెల్ మోగించారు.

'బాత్‌రూం' కెళ్ళాను ... స్నానం చేసి 'డ్రెస్' అయి బ్రేక్‌ఫాస్ట్ ముగించి బయల్దేరేసరికి పదిగంటలు దాటింది.

ఆఫీసు చాల దగ్గరగా వుంది. నడిచే వెళ్ళాం ... మేనేజర్ రూం 'నీట్'గా సర్ది వుంది ...

"ఈష్ట్‌కోష్ట్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ"



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం,విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొ వడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ,చిరునామా రచన చివరకూడా స్పష్టంగావ్రాయాలి— హామీపత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా మమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తరప్రత్యుత్తరాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివరంగా వ్రాయండే, వాటి గురించి పరిశీలించడం కష్టం,

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి పచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ "ప్రతు"లను— కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము.కాపీలు టపాలోపోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు.

పం ॥

## రంగుటద్దాలు

మేనేజరుగా ఛార్జ్ తీసుకున్నాను. ఒక గంట అయ్యాక రాఘవగార్ని తీసుకుని "సైట్"కు బయలే రాను...

'సైట్'లో...

అతను 'డ్రాయింగ్స్' లో తదేకంగా దృష్టి నిలిపి 'మేస్త్రీ'కి ఏదో సలహాలిస్తున్నాడు. కళ్ళకు "గాగుల్స్"నోటో సిగరెట్ వున్నాయి, అతడు మమ్మల్ని గమనించడంలేదు.

"రాఘవగారూ అతడు..."

"సూపర్‌వైజరుగా వుంటున్నాడండీ! పనిలో మంచి దిట్ట ఒకసారి పిలుస్తానుండండీ" రాఘవగారు "కుటుంబరావ్!" అంటూ ఒక్కసారి గట్టిగా కేకేశాడు.

అక్కణ్ణించే కుటుంబరావు తల పైకెత్తి మమ్మల్ని చూశాడు గాగుల్స్ తీసి జేబులో పెట్టుకున్నాడు సిగరెట్ తీసి విసిరేశాడు.

"వీరు రాంప్రసాద్ గారు. మన మానేజరుగా యీరోజుఛార్జ్ తీసుకున్నారు."

"నమస్కారం సార్!" అంటూ కుటుంబరావు ఎంతో వినయంగా చేతులు కలిపాడు.

ఇంతలో రాఘవగారు ఏదో పనున్నట్టు ముందుకు నడిచారు

"క్షమించండిసార్! మీతో రాత్రంతా..." కుటుంబరావు ముఖం దిగాలుగా వుంది.

"ఫర్వాలేదు లేవోయ్ అయినా ఉదయం నాతో చెప్పకుండానే బస్ దిగేశావ్"

"అవున్సార్! నా సామాన్లు తీసుకుంటూ మీ బ్యాగ్ వైపు చూశాను. ఆ బ్యాగ్‌పై మీ అడ్రసు చూసేసరికి నాతల తిరిగినట్టయ్యింది. రాత్రి మీతో ప్రయాణిస్తూ చెప్పిన గొప్పలు నిజంకావు సార్. నన్ను క్షమించండి"

"ఓకే! ఓకే!!" అంటూ ముందుకు నడుస్తూ, కుటుంబరావుని పిలిచి సైలాభాలుంటాయన్నాడు గదా! అవేంటో కనుక్కోవాలనిపించింది నాకు. వెంటనే కుటుంబరావును పిల్చి గెస్ట్‌హౌసులో కలవమని చెప్పాను, సాయంకాలం ఆరు గంటలు దాటాక.

### అంకితం

మిత్రులు, స్నేహశీలి కీ. శే. వి. పి. సోమశేఖర్‌రావుగారికి దుఃఖాశ్రువులతో...

— వేణు

# 8-11-1981 ఆంధ్రప్రదేశ్ లో



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధాన మంత్రి)

## కుటుంబ

## నియంత్రణ

## పురోగతి



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

★ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గత కొన్ని సంవత్సరాలుగా కుటుంబ సంక్షేమ కార్యక్రమాలను అమలు జరపడంలో గణనీయమైన అభివృద్ధిని సాధించారు.

★ 1980 81 ఆఖరునాటి వరకు మొత్తం 34.86 లక్షల కుటుంబనియంత్రణ శస్త్రచికిత్సల నిర్వహణ 3.22 లక్షల ఐ. యు డి అమర్చడం జరిగింది.

★ 1980-81 ఆఖరునాటికి 27.23 శాతం అర్హులైన దంపతులకు వివిధ రకాల కుటుంబ సంక్షేమ పద్ధతులద్వారా పటిష్ఠమైన రక్షణ కల్పించబడింది.

★ 1980-81 లో 98.8 శాతం కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలను నిర్వహించి మన రాష్ట్రం అపూర్వ స్థానాన్ని ఆక్రమించింది. ప్రస్తుత సంవత్సరంలో 76.35 శాతం లక్ష్యాన్ని అప్పుడే సాధించడం జరిగింది.

★ గత సంవత్సరం మన రాష్ట్రంలో 13241 వైద్య రీత్యా గర్భవిచ్ఛిత్తి నిర్వహించబడింది.

★ రోగనిరోధక కార్యక్రమం క్రింద అన్ని వైద్య చికిత్సాలయాలలో 0.5 సంవత్సరాల మధ్య వయస్సుగల బాలలకు కోరింతదగ్గు, ధనుర్వాతం, పోలియో వ్యాధుల నిరోధక చికిత్సలను నిర్వహించారు.

★ గర్భిణీ స్త్రీలు, బాలల పౌష్టికాహార లోపాన్ని నివారించడానికి వీలుగా ఐరన్, ఫాలిక్ ఆసిడ్ బిళ్లలను సరఫరా చేశారు.

**వచ్చే సంవత్సరం ఆఖరునాటికి రాష్ట్రంలో 1,000 కి 30 మేరకు జననాల రేటును తగ్గించడానికి తీవ్రంగా కృషి జరుగుతున్నది.**

---

సమాచార, పౌర సంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు.

**D.I.P.R No. 52431/Advt/Cl-3/81** **Advt No. 59**

# వంటలు

## తిల్యాట్

కావలసిన వస్తువులు: వేరుశనగ గింజలు – 1 గిద్ద, ఎండు కొబ్బరి – 1 చిప్ప, బెల్లం – పావు కె జి

విధానము : ముందుగా వేరుశనగ గింజలు వేయించుకొని పొట్టు తీయాలి. మాడి పోయిన గింజలు తీసేసి, పొట్టు ఏ మాత్రం లేకుండా బాగు చేయాలి. ముందుగ వేయించిన వేరుశెనగ గింజలు రోట్లో వేసి బాగా తొక్కాలి గింజలు బాగా నలిగిన తర్వాత ఎండు కొబ్బరి ముక్కలుగా చేసి, అందులో కలిపి మెత్తగా దంచాలి. దంచిన తర్వాత బెల్లం కూడా వేసి ముద్దగా అయ్యేంతవరకూ రోట్లో దంచాలి. నూనె పైకి తేరే వరకూ దంచిన యీ మిశ్రమాన్ని ఉండలుగా చేసుకోవాలి ఇవి చాలా బాగుంటాయి. చేయడం కూడా తేలికే!

— షాజాద్



## సొరకాయ స్వీట్

కావలసిన వస్తువులు : సొరకాయ – అరకేజి, చక్కెర – పావుకేజి నెయ్యి – ఒక కప్పు, యాలకులు, కిస్‌మిస్, జీడిపప్పు (కావాలనుకున్నవారు మిఠాయిరంగు వేసుకోవచ్చు).

తయారుచేయు విధానము : ముందుగా సొరకాయ మీది పొట్టు చెక్కు తీయాలి. తడి లేకుండా శుభ్రంగా తుడిచి లోపలిగుజ్జు అంతా తీయాలి. కొబ్బరికోరులా సన్నగా తరగాలి రెండు గంటలసేపు ఆ కోరును ఎండలో ఎండబెట్టాలి తర్వాత వెడల్పాటి గిన్నెలో చక్కెరను తీగపాకం వచ్చేటట్టుగా గరిటతో కలుపుతూ వుండాలి తీగ పాకం వచ్చాక సొరకాయ కోరును పాకంలో వేసి కలపాలి యాలకుల పొడి కిస్‌మిస్ జీడిపప్పు వేసి మరోసారి కలపాలి సన్నని సెగమీద కొద్దిసేపు స్టౌమీద వుంచాలి అప్పుడు గిన్నెను క్రిందికి దించుకోవాలి పూరీలో తింటే బాగుంటుంది. పూరీ లేకుండా కూడా తినవచ్చు ఎవరైనా అతిథులు వచ్చినపుడు పెట్టటానికి వీలుగా వుంటుంది శ్రమ ఎక్కువగా వుండదు. చేసి చూస్తారు కదూ!

— కె. సుభద్ర




## అమృత జిలేబి

సామాగ్రి మినపప్పు – 1 గ్లాసు, చక్కెర – 4 గ్లాసులు, జిలేబీరంగు ఒక స్పూన్, కుంకుమపువ్వు 1 గ్రా., బియ్యం–అరగ్లాసు, నెయ్యి – 3 లేక 4 గ్లాసులు.

విధానం : బియ్యం, పప్పు కలిపి ఒక గంటముందు నానబెట్టి, గట్టిగా రుబ్బాలి. చక్కెర లేత పాకం తీయాలి తర్వాత కుంకుమపువ్వు కొంచెం పాలలో నానబెట్టి, రంగుతోపాటు పంచదార పాకంలో వేయాలి. కళాయిలో నెయ్యి మరుగుతున్నప్పుడు, పైన రుబ్బిన పిండిని జంతికల గొట్టంలో కూరి చుట్టలు వచ్చేటట్టుగా కళాయిలో ఒత్తుకుని, బాగా వేగనిచ్చాక తీయవలెను తర్వాత వేగిన జిలేబీలను పంచదార పాకంలో నానబెట్టవలెను.

— ప్రభా మల్లిబాబు

## హూరున్న హోళిగి

కావలసిన సామానులు : పావు – శెనగ బేడలు, గోధుమలు – పావు, చెక్కెర అర కె.జి, డాల్డా–అరకేజిలేక ఒకటిన్నర శేర్లు, నెయ్యి, పెరుగు – కొద్దిగ, గోధుమపిండి – పావుకేజి

తయారుచేయు విధానము : శనగబేడలు గోధుమలు దోరగా వేయించి పిండి విసరవలెను మరియు చక్కెర కూడా విసురుకొనవలెను. పైన విసిరిన పిండి మరియు చెక్కరను డాల్డాతో కాని, నెయ్యితో కాని కొద్దిగా పెరుగువేసి ముద్దగా కలుపుకొనవలెను ఒక గిన్నెలో గోధుమపిండిని జల్లించి ముదగా కలుపుకొని, ముద్దగా కలిపిన పిండిలో కొద్దిగా నూనె వేసి మూత పెట్టవలెను. కొద్దిసేపు పిండి నానిన తరువాత పైన చెప్పిన పూర్ణము, గోధుమ పిండి తీసుకొని, పూర్ణాన్ని గోధుమపిండిలో పెట్టి హోళిగ చేసినట్టు చేసి తింటూవుంటే ఇంకా, ఇంకా తినాలని అనిపిస్తుంది. ఈ పిండివంట నాలుగు రోజులు నిలువ వుంటుంది.

— ఎల్. భారతీబాయ్




ఆకాశం కుండపోతగా కురుస్తోంది. హోరు మన్న గాలి కూడా దాంతో స్నేహం చేస్తోంది ఆ సాయంకాలం పెందలాడే చీకటి కాటుక పెట్టుకుంటోంది ఆకాశంలో బంగారం కత్తులు విరుగుతున్నట్లుగా మెరుపులు వాటి వెంటనే ఉరుములు. ఆకాశంలో దేవతలు దీపావళి పండుగ చేసుకుంటున్నట్లుగా పిడుగులు.

"కొండయ్య తాతా! ఈ వారసం తుపాను కిందెట్టదుకదా కొంపదీసి..." అడిగాడు వెంకడు.

"సెప్పలేంరా! దీని సంగజ్జూస్తే నీ మాటే నిజం చేసేటట్టుంది" అన్నాడు కొండయ్య తాత నిదానంగా ఆరిపోయిన బీడీని వెలిగించుకుంటూ. వాడికి అరవై యేళ్ళుంటాయి. తెల్లటి గెడ్డం. పీక్కుపోయిన కళ్ళు దరిద్రదేవత కసితో పీల్చి పిప్పిచేసినట్లుగా ముడతలు పడిన శరీరం.

అకస్మాత్తుగా ఆకాశంలో మెరుపు మెరిసింది. దగ్గరోనే పెద్ద ఆటంబాంబు పేలిన శబ్దంతో పిడుగు పడింది.

ఆ శబ్దానికి ఆ పాడుపడిన సత్రం కాస్త గజగజలాడినట్లు అనిపించింది.

"ఓలమ్మో యిదేటి మావా... కొంప దీసి సత్రవుగాని కూలిపోదు గదా..." అంది లచ్చి పొయ్యిలో మండే పుల్లల్ని ఎగదోసి, వెంకడివంక చూస్తూ దాని ఒంటిమీద చాలీ చాలని బట్ట. దాని గుండెలమీద పసిపాప భయానికి కరుచుకుపోయి వుంది.

"ఊరుకోయే! ఏటా అపశకునం మాటలు.." అన్నాడు చుంటివాడిని తీసుకుంటూ. పొయ్యిమీద గంజి కుతకుతలాడుతోంది.

పూర్వీకులు ఏ పుణ్యకార్యం ఉద్దేశించి కట్టారోగానీ, ఆ సత్రవు చాలా సంవత్సరాలనుండి పాడుపడిపోయి అడుక్కు తినేవాళ్ళకు ఆశ్రయం యిచ్చింది. కుంటివాళ్ళూ, గుడ్డివాళ్ళూ కలిపి మొత్తం అయిదారు కుటుంబాలు కాపురం వుంటున్నాయి ఏ కుటుంబం లేనివాడు కొండయ్య ఒక్కడే వాళ్ళకు మంచీ చెడ్డా చెప్పడానికి కొండయ్యే వాళ్ళకి పెద్దదిక్కు.

కొండయ్య ఒక్కసారి వరండా చూశాడు కొంతమంది వండుకుంటున్నారు కొంతమంది ప్రపంచం ఏమైనాసరే మనకేం అన్నట్లు నిర్విచారంగా గంజాయి పీలుస్తున్నారు. ఈదర గాలి వరండాని గూడా తడిపేస్తోంది. పొడిగా వున్న స్థలం చూసుకుంటూ, సర్దుకుని కూచుంటున్నారు.

ఊరికి కొంచెం దూరంగా కడుతున్న లనీలో చివరన వుంది సత్రం. దానికి ఒక్క వెనక్కనే గోనెసంచుల గోడవును

"తాతా! ఈ పొద్దు గెంజి కాసుకోవా" అడిగింది లచ్చి.

అడ్డంగా తలూపాడు

"గింజలు దొరకనేదా ?" వెంకడి వశ్న

"విల్లా లేదురా! యేరే పనిమీదుండి పోనాను"

"పోన్లే మావిస్తాం కుసింత. ఉల్లిపాయ నంజుకుని తాగు" అంది లచ్చి.

"ఒద్దులేయే తల్లీ! సాంబుకొట్టుకాడ టీ తాగేసే వొచ్చాను" అన్నాడు కొండయ్య.

వర్షం మరింత వుధృతమైంది. రోడ్డు మీద నీరు, కంకరరాళ్ళను వొరుసుకుంటూ ప్రవహిస్తోంది.

"ఏటా మొగమాటం . పొయ్యవే లచ్చి... అసలే దరిద్ర వారసం...బయటకెళ లేదు" అన్నాడు వెంకడు కొండయ్య దగ్గరకు దాక తెచ్చియిస్తూ .

నీరసంగా వున్న కొండయ్య గంజి తాగే

## మానవత్వపు మజిలీలో...

నరికి కొంచెం చురుకుదనం వచ్చింది. కృతజ్ఞతా పూర్వకంగా లచ్చి వేపు చూశాడు. అది పసికూనకు పాలు యిస్తోంది.

దరిద్రుల్ని శపిస్తున్నట్టుగా వర్షం కురుస్తోంది వర్షం వచ్చినప్పుడల్లా వాటితో స్నేహంచేసి ఆరిపోయే విద్యుద్దీపాలు మాత్రం యింకా ఆరలేదు. ఆ వెలుగులోనే ఎదురుగా కొంచెం రోడ్డు ప్రక్కగా పెద్ద రావిచెట్టు, దెయ్యం పట్టినట్టుగా పిచ్చిగాలికి వూగుతోంది. విరిగి పడడానికి సిద్ధంగా వున్నట్టు ఫెళఫెళ శబ్దం చేస్తోంది

"ఈ గాలికి రావిసెట్టిరిగి పోతుందేమో" అన్నాడు మరొక బిచ్చగాడు ఆరిపోయిన చుట్టపీక పారేస్తూ.

"అదెక్కడిరిగిపోద్దిరా! అది దేవుడిసెట్టు. ఏపురో యేపసెట్టుకీ దానికీ పెళ్ళి సేసి మరీ పాత్రేరా" అన్నాడు వెంకడు

"అందుకనే గిదంట్రా, ఆ బాబు దాన్ని కొట్టించీనేకపోనాడు లేకపోతే... అతగాడి మేడకు అడ్డంచునా..." అంది లచ్చి.

అతగాడనేవాడి పేరు జగ్గారావు. ఆ వూళ్ళో పేరు మోసిన పెద్ద వ్యాపారస్తుడు. రావి చెట్టుకు ఆనుకుని అరఎకరా స్థలంలో మధ్యలో పెద్ద భవంతి కట్టించాడు. చుట్టూ పెద్ద ప్రహరీ గోడ, లోపల అందమైన పూల చెట్లు, ఆ భవంతికి అందులో ఖరీదైన మనుషులకి, అంతకంటే ఖరీదైన ఆస్తిపాస్తులకి హామీ యిస్తున్నట్టుగా పెద్ద ఆల్సేషియన్ కుక్క— అడవిలో తిరిగే పెద్దపులిలా పచార్లు చేస్తూ వుంటుంది. ఆ మేడ కాపలా ఆ కుక్కదే.

సత్రవులో చాలా మంది నిర్విచారమైన నిద్రలోకి జారుకుంటున్నారు. వ్యథలూ, వెతలూ లేని జీవితం వారిది. ఉన్నది ఎవరో దోచుకుపోతారన్న భయంలేదు. రేపు ఎలా బ్రతుకుతాం అన్న తపనా లేదు.

"ఏటి తాతా... కునుకు తియ్యవా... ఈ ఏదవ వరసానికి తోడు సలిగాలి గూడా పేరంభమైంది" అంది లచ్చి పిల్లడిని వెంకడి పక్కలో పడుకోబెట్టి. విరిగిపోయిన కుండలో భద్రంగా దాచిన గోనె గుడ్డలు తీసి కప్పింది. కొండయ్య లచ్చి మాటలకు సమాధానం చెప్పలేదు. ఆ వర్షం జోరులో వినిపించలేదు. లచ్చి చిత్రంగా కొండయ్య వేపు చూసి

### 'జ్ఞాపకం'

జ్ఞాపకం ...
గుండె కొమ్మనుండి
జారిపడిన
అనుభూతి పుష్పం ...
వదలిపోయిన
తొడిమకు
సంకేతం !

— "పైడి శ్రీ"

పడుకుని పడుకుంది. కొండయ్య మరొక బీడీ వెలిగించుకున్నాడు. రావిచెట్టు వెనకాల ఇంద్రభవనాన్ని చూస్తున్నాడు. ఆ భవనం యజమాని, దాని కథ అతనికి తెలుసు.

పది సంవత్సరాల క్రితం సైకిలు మీద గోనెలు అమ్మేవాడు గోనెలు, పేపర్లు, చిత్తు కాగితాలు, ఇనుపముక్కలూ కొనేవాడు. అలాంటోడు ఈనాడు, వూళ్ళో రకరకాల వ్యాపారాలు చేస్తున్నాడు. రేపో మాపో కాబోయే చేర్మెను గూడాను సత్రవు ప్రక్కనే స్థలంకొని పెద్ద గోడవును కట్టించాడు. దాన్నిండా గోనెసంచులే ఆ వర్షంలో ఆ మెరుపుల వెలుగులో పాలరాతి భవనంలా, దేవేంద్రుడికి స్వర్గలోకంమీద, ఆ రొటీన్ లైఫ్‌మీద విసుగు పుట్టినప్పుడు భూలోకంలో ఆటవిడుపుకి రెస్టు తీసుకుంటానికి కట్టుకున్న భవనంలా జగ్గారావు మేడ తళుకులీనుతోంది.

రావిచెట్టు విరుగుతున్నట్టుగా ఫెళఫెళ శబ్దం. కొండయ్య ఉలిక్కిపడ్డాడు. చెట్టు యథాప్రకారంగానే వుంది. బీడీ ఆరిపోయింది. అ పయత్నంగానే అతని చెయ్యి అగ్గిపెట్టె తీసింది. అందులో మూడే పుల్లలున్నాయి. తడిచిన అగ్గిపెట్టెను జాగత్తగా చేతితో రాసి వెలిగించుకున్నాడు. ఒక్కసారి వొళ్ళు విరుచుకుని లేచాడు. ఆరిపోయిన పొయ్యిల దగ్గర కుక్కలు రెండు నిద్రలో జోగుతున్నాయి.

'ఈ వొరసం ఈ రాత్రికి వదిలేనట్టు లేదు, అనుకున్నాడు మనసులో ఆకాశం కేసి చూస్తూ. ఆఖరి దమ్ములాగి బీడీ పారేశాడు. తను కాళ్ళు బారజాపి పడుకోవడానికే స్థలం వుంది. మిగతా సత్రవు వరండాలో పెమ్మ లూడిని గచ్చు చిత్తడి చిత్తడిగా వుంది.

"ఇంకా తొంగోనేవా కొండయ్య తాతా!" అన్నాడు వెంకడు పక్కకి ఒత్తిగిలుతూ.

"లేదురా వుప్పుడే కంటిమీద కునుకు వొస్తుండాది" అంటూనే విరిగిన కర్రపెట్టి దగ్గరకు వెళ్ళాడు పాత గోనెగుడ్డ చిరిగినది నేలమీద వేశాడు. మరొక అంలో అపురూపంగా పాలిథిన్ పేపరో దాచిన గోనెగుడ్డ ముక్కను తీశాడు వొంటినిండా కప్పుకున్నాడు తృప్తిగా నిట్టూర్చాడు. దీని కోసమే అతను బిచ్చమెత్తడం మాని బజార్లో ఒక కొట్టు దగ్గర సంపాయించాడు. ఆ షాపు యజమాని నెలల తరబడి వాయిదా వేస్తూ ఆ రోజు సాయంకాలమే యిచ్చాడు. కొత్త గోనె వింత రకం వాసన వేస్తున్నాది. నిండా కప్పుకుని కళ్ళు మూసుకున్నాడు. కొత్త గోనె గుడ్డేమో మరీ వెచ్చదనం యిస్తున్నాది. స్వర్గసుఖం పొందినంత ఆనందం అనుభవించాడు. పెట్టెలో ఎవరో బాగా చిరిగిన బనియను దానం చేసింది వుంది. దాన్ని చలికాలం కోసం దాచుకున్నాడు. "ఈ వొరసాకాలమే సలికాలంలా వుంది" అనుకున్నాడు ఆ మర్నాడు ఆ బనియను గూడా తొడుక్కోవాలనుకుంటూనే నిద్రలోకి జారిపోయాడు.

* * *

రావిచెట్టు ఫెళ ఫెళ మని విరిగిన శబ్దం. కొండయ్యకి హటాత్తుగా తెలివి వచ్చింది. దూరంగా ఎక్కడో తీతువు పిట్ట హృదయ విదారకంగా అరచిన ధ్వని గుండెల్లో గుబులు పుట్టిస్తున్నాది వర్షం జోరు తగ్గింది. ఎదురుగా కనిపించిన దృశ్యం అతని నిద్రమత్తు వదలగొట్టింది. కళ్ళు నులుముకుని మళ్ళా చూశాడు.

నిజమే, ఈసారి చెట్టు నిజంగానే విరిగిపోయి పడింది. ఆ పడటం నేలమీద కాదు, కారు మీద పడిందన్న నిదర్శనానికి ఆకుల మధ్య కారు లైట్లు రెండు చిక్కుకుని మందంగా వెలుగు లీనుతున్నాయి.

"ఒరేయ్... వెంకా ... వెంకా..." తట్టి లేపాడు.

"ఏంది తాతా! అద్దరేతిరేల మద్దెల దరువులు..." అన్నాడు లేవకుండానే విసుగుతో.

"తెగాసే! కారు మీద రావిసెట్టిరిగి పడిపోయింది. బహుశా జగ్గారావు బాబే అయుంటాడు. కారు మొఖం గేటు వేపే వుందిరా ... సూద్దాం పదరా..." అన్నాడు ఆత్రుతగా కొండయ్య.

"పొద్దున సూద్దాంలేరా! ముసలాడా తొంగో" అన్నాడొక బిచ్చగాడు, మరుక్షణం నిద్రలోకి జారుకుంటూ; లచ్చి బొమ్మలా కానుకుని పసిపాప నిద్రలోనే పాలు అబగా తాగుతున్నట్లుగా వాడి పెదాలు చలిస్తున్న దృశ్యం ఆ కారులైట్ల వెలుగులో కనిపించింది. వీళ్ళతో లాభంలేదనుకుని కారు దగ్గరగా వెళ్ళాడు కొండయ్య. అతని వూహే నిజమైంది. కారులో అచేతనంగా పడి వున్నాడు జగ్గారావు, ఆ మేడ యజమాని. చెట్టు మాను గేటు కడ్డంగా పడిపోయి వుంది దిగాలని ప్రయత్నించాడేమో! కారు డోరు తెరచి వుంది. అతని భుజం మీద బరువైన కొమ్మ పడివుంది. జగ్గారావు బాధతో వణుకుతూ మూలుగుతున్నాడు

ఇంకేం ఆలోచించలేకపోయాడు.

"బాబూ...బాబూ..." భుజం తట్టాడు.

జగ్గారావు ఖరీదయిన బట్టలు వేసుకున్నాడు. వాటిమీద స్ప్రే చేసుకున్న ఫారిన్ సెంటు చల్లగాలి తేమతో కలిసి వింత వాసన కొడుతోంది. జగ్గారావు భారంగా కళ్ళు తెరిచాడు. మళ్ళీ బాధతోనే కళ్ళు మూసుకున్నాడు. కొండయ్యకు ఏం చేయడమో తోచలేదు. గేటువేపు చూశాడు. దొంగలెవరు రాకుండా సూది మొనలాంటి బల్లెలుగల ఇనుప వూచలతో పెద్ద గేటు. ఎత్తయిన ప్రహరీ గోడ. దానిమీద అంగుళమైనా ఖాళీలేకుండా గాజుపెంకుల ముక్కలు, బయటికేక లోపలికి, లోపలికేక బయటకి వినిపించదు. వర్షం మళ్ళా ఉధృతమయ్యే సూచనలు కనిపిస్తున్నాయి. యింకేం ఆలోచించలేదు కొండయ్య భుజం పట్టుకుని నెమ్మదిగా లేవదీశాడు. దొంగ వ్యాపారాలు చేసి నానా గడ్డి కరిచి పెంచుకున్న జగ్గారావు శరీరం చాలా బరువుగా వుంది. అలాగే పారుతున్న వరద నీటిలో నెమ్మదిగా సత్రవులోకి చేర్చాడు ఆ మహాకాయాన్ని. నెమ్మదిగా తడిచి పోయిన ఖరీదయిన కోటును తీసి ప్రక్కకు పడేసి తను పడుకున్న జాగాలో పడుకోబెట్టాడు. అతని చొక్కా జేబు వంద రూపాయల నోట్ల కట్టలతో నిండివుంది.

క్షణం సేపు నిలబడ్డాడు కొండయ్య. చుట్టూ చూశాడు. స్థలమంతా నీటితో చెమ్మగిలి వుంది. పడుకోవటం మాట ఎలా వున్నా తనెక్కడ కూర్చోవాలో తెలియలేదు. ముంజూరు నుండి పడే వర్షం ధార కారు లైట్ల వెలుతుర్లో వెండి కరుగుతున్నట్లుగా కనిపిస్తోంది.

అప్పటివరకూ అచేతనంగా పడివున్న జగ్గారావు కదులుతున్నట్లనిపించింది. ఆత్రుతగా వంగి చూశాడు. బాధతో మూలుగుతున్నాడు.



## మానవత్వపు మజిలీలో...

"ఏం బాబూ! బాధగా వుందా" అడిగాడు కుదుపుతూ కొండయ్య. భారంగానే కళ్ళు తెరిచాడు జగ్గారావు. ఒళ్ళంతా నొప్పిగా వున్నట్లు ముఖం చిట్లించాడు. చలికి పళ్ళు గిట్టకరుచుకు పోతున్నాయి. బయట వర్షం వేగం పుంజుకుంది "దా...హం..." జగ్గారావు నోటి వెంట అస్పష్టంగానే వచ్చాయి. వెంటనే కుండలో నీళ్లు సొట్టలు పడిన అల్యూమినియం గ్లాసుతో తెచ్చి గొంతులో పోయడానికి ప్రయత్నించాడు. కానీ అవి దిగలేదు. అవి మంచుకన్నా చల్లగా వున్నాయి. పెదవులు తడిశాయి. జగ్గారావు కన్ను మూయలేదు.

"ఈ వారసంలో ఏడిగ ఏ కాపీయో ఏ టీయో అయితే గొంతు దిగుతాది కాని ఈ మంచు నీళ్ళ గుటక పడేదెలా" అనుకుంటూనే బుర్ర గోక్కున్నాడు. క్కర పెట్టడుగున కొంచెం మిగిలిన టీ కవరు గుర్తుకు వచ్చింది.

"ఉహు...ఉహూ...ఉహు..."బాగా చలి జగ్గారావును కౌగలించుకుంది.

"అయ్యో! సలికి బాబు గుండె లగిపి పడుతున్నాయి...ఏటి సేయడం బగమంతుడా" అంటూనే తను తెచ్చిన గోనె గుడ్డను కప్పాడు. జగ్గారావు చూస్తూనే వున్నాడు కానీ అతని నోటివెంట మాట రావడంలేదు. కొత్త గోనెపట్టా చాలా వెచ్చగా వుంది. అతని మూలుగు తగ్గింది. కానీ పెదవులు మాత్రం దాహంతో అలమటిస్తున్నట్లుగా కదులుతున్నాయి.

"ఈ బాబుకు టీ డికాసను కాసివ్వాల" అనుకున్నాడు, తల గోక్కున్నాడు. వున్న కాసిని చితుకులు వర్షంలో తడిసి మూల నక్కి వున్నాయి.

ఉన్నట్టుండి ఆకాశంలో మెరుపు మెరిసింది. అదే సమయంలో కొండయ్య బుర్రలో ఆలోచన. "అవును అలాగే చేయాలి" అనుకుంటూ పెట్టె దగ్గరికి వెళ్ళాడు. రేపు తను తొడుక్కోవాల్సిన బనియను తీశాడు. బనియను కాస్త చిరిగిన దైనా గట్టిగా వుంది. దాన్ని ముక్కలు ముక్కలుగా చేశాడు. సిల్వరు తపేలాలో నీళ్ళుపోసి టీపొడి వేసి ఇటుకల పొయ్యిమీద పెట్టాడు. అగ్గిపెట్టె తెరిచాడు

అందులో రెండే అగ్గిపుల్లలు వున్నాయి. అగ్గిపుల్లను చేతితో రుద్ది పుల్ల వెల్గించాడు. అది వెలిగింది. కానీ టప్‌మని ఆరిపోయింది గాలి తాదకు. మిగిలిన దొకటే అగ్గిపుల్ల. అందరూ సాయంకాలం తనదగ్గరే అగ్గిపెట్టె తీసుకుని వండుకున్నారు.

"బగమంతుడా వుప్పుడేటి సేయడం" అనుకుంటూనే జాగ్రత్తగా ఆఖరి పుల్ల వెలిగించి పొయ్యిలో వేశాడు. ఆనందంతో వాడికళ్ళు మెరిశాయి. గుడ్డపీలికలు మండటం ప్రారంభించాయి.

జగ్గారావు వేపు చూశాడు. అతనలాగే వెలిగే పొయ్యివంక చూస్తున్నాడు కొండయ్య. ఒక్కొక్క పేలిక వేస్తూనే వున్నాడు. అది మండుతూనే వుంది. అప్రయత్నంగానే జగ్గారావు శరీరంమీద నిండుగా కప్పబడిన కొత్త గోనెగుడ్డను చూశాడు.

ఆ చూపులు ఆలోచనలమధ్య చిక్కుకుని చాలా జ్ఞాపకాలను వెలికి తీసింది. ఆ జ్ఞాపకాల పొరలమీద నాగరిక భాషలో చెప్పబడ్డ పరాభవాలు, చీదరింపులు, అసహ్యాతలు లాంటివి చాలా వున్నాయి

జగ్గారావు గోడవునుండి గోనెసంచులు, గోనెపట్టాలు లారీల్లో ప్రతీరోజూ లోడయి, యితర ప్రాంతాలకు రవాణా అవడం, తిరిగి సరుకు రావడం రివాజు.

రోజూ కారు గోడవును దగ్గరకు వచ్చేది. విదేశీ సిగరెట్టు కాల్చుకుంటూ జగ్గారావు దిగి గోనెపట్టాల లోడింగు చూసేవాడు.

"దండాలండీ బాబుగోరు..." మొట్ట మొదటిసారిగా కొండయ్య.

"ఎవర్రా నువ్వు ఏం కావాలి" అన్నాడు అసహ్యంగా, బిచ్చగాడని గుర్తించిన కొండయ్యను గుర్తించిన జగ్గారావు

"ఏంలేదు పనికిరాని గోనెపట్టా యిప్పించండి బాబూ! సలికాలం...దరమ పెబువులు" అన్నాడు వినయంగా.

"మీకందరికీ పంచడానికేనా మేం వ్యాపారం చేస్తున్నాం. ఫో... ఫో... యిక్కణ్ణుంచి" కసిరేశాడు మరో సిగరెట్టు వెలిగించుకుంటూ. అయినా ఆశ వదల్లేదు కొండయ్యను. 'అడగ్గా అడగ్గా ఆ మాత్రం మనసు కరిగి ఓ పట్టాముక్క పారెయ్యడా ఆ బాబు' అన్న నమ్మకంతోనే వుండి చాలాసార్లు అడిగాడు. చాలాసార్లు పరాభవాలు పొందాడు.

"ఎందుకురా ... ఆ బాబు యిచ్చేడా... వుటి పిసినార్రా...సచ్చేటప్పుడన్నా ఆ బాబు మీదేసి కాలుస్తారు. నీకు బుద్ధిలేదురా ముసలోడా" అని మిగిలిన బిచ్చగాళ్ళు తిట్టేవారు. వాళ్ళు అడిగి అడిగి విసిగెత్తిన వారే. వాటిని గూడా లెఖ్ఖచెయ్యక తన ప్రయత్నం కొనసాగించేవాడు. చివరకు జగ్గారావు కళాసీలు వాణ్ణి కొట్టి బయటకు గెంటవేశారు.

టీ డికాషను మరిగి పొంగుతోంది. వింత వాసన వేస్తోంది, గుడ్డకాలిన వాసనతో స్నేహంచేస్తూ — మరుగుతున్న ఆలోచనల్ని వదిలి వర్తమానంలోకి వచ్చాడు కొండయ్య— కొత్త గోనెపట్టా కప్పుతో వెచ్చగా జగ్గారావు దీనంగా వెచ్చని మంటల్ని చూస్తున్న దృశ్యం కన్పించింది. టీ మరిగి తెప్పరిల్లుతోంది. పొయ్యిలో మంట గూడా తగ్గిపోయింది. మురికి గుడ్డతోనే టీ వడపోశాడు.

"బాబూ ... కొంచెం టీ డికాసను తాగండి" అంటూనే తల మీదకు కొంచెం ఎత్తిపోశాడు. అమృతం తాగినట్లుగా గుటక వేశాడు జగ్గారావు. కొండయ్య కళ్ళు తృప్తితో మెరిశాయి.

జగ్గారావు తృప్తిగా కళ్ళు మూసుకున్నాడు. అతని ఆకలి బాధకు కాస్త ఉపశమనం కల్గింది.

వేడి నీటితో, అతని మస్తిష్కం పని చేయడం మొదలుపెట్టింది. వాడు తనని అడుక్కున్న రోజులు జ్ఞాపకం వచ్చాయి. అలాంటి కొండయ్య తనని రక్షించాడు. వర్షంలో గాలిలో వీడు రక్షించకపోతే తన గతేంకాను? ఏం అనుబంధం ప్రేరేపించింది వీడిని. అవును వాడు మనిషి ... నేనూ మనిషినే— అతనిలోని కరుణ, మానవత్వపు మనుతాను బంధమే కాపాడింది రోజూ. వీడు మనిషికాదు...కరుణా సముద్రుడని దేవుణ్ని అంటారు కానీ కాదు. వీడు...కాదు...కాదు ...ఈ మహాపురుషుడు నా పాలిట దేవుడు... అవమానాలు మగ్గిపోయిన ఈ దేవుని మనసులో, అమృతం పొంగి పొరలుతోంది. లేకపోతే దిక్కులేని చావు నాకు గతి అయి వుండేది. రేపు ఈ దేవుని పూజించుకోవాలి. ఇంత వరకూ, ఈ పతితుని గోడవునుగా మార్చాలని, కొనాలని అనుకుంటున్నాను. ఇప్పుడా వుద్దేశ్యం విరమించుకుంటాను. ఈ పతితుని నివాసం కోసం బాగుచేయించి గదులు కట్టిస్తాను. ఈ దేవుని నా దేవాలయంలో పెట్టి పూజించుకుంటాను సేవిస్తాను ... అని మనసులో అనుకుంటూనే కళ్ళు తెరిచాడు.

దూరంగా కాళ్ళు ముడుచుకుని కూర్చున్నాడు కొండయ్య. చిరిగిపోయిన మురికి బనియన్ తడిసి ముద్దయిపోయింది వాడి వొంటిమీద స్తి కప్పు నుండి వర్షంచినుకులు బొట్లు బొట్లుగా రాలుతున్నాయి, అప్పుడప్పుడు. ఇంకెక్కడా వాడికి తల దాచుకుందికి స్థలం లేదు.



# మానవత్వపు మజిలీలో...

మగతనిద్రలోనే ఉలిక్కిపడ్డాడు కొండయ్య. జగ్గారావు తనవేపే చూస్తున్నాడు.

"బాబూ! ఏటి కావాలి... మరిన్ని టి చుక్కలు కావాలా..." అనడిగాడు ఆతృతగా.

అడ్డంగా తలూపాడు జగ్గారావు, వెచ్చని నిద్రలోకి జారుకుంటూ.

* * *

"బాబుగోరూ... బాబుగోరూ..."

జగ్గారావుకు తెలివి వచ్చింది. ఆ వచ్చిన వాడు తన నౌకరు. తూర్పున ఉషో రేఖలు విచ్చుకుంటున్న సమయం. ఆకాశం తుపాను రాక్షసుణ్ని జయించిన విజయ గర్వంతో నిర్మలంగా నవ్వుతోంది.

"బాబూ! రాత్రంతా తమకోసం ఇంటిల్లిపాది బెంగెట్టుకుపోయాం. యెదవ వొరసం బయటికి రానివ్వలేదు. లెగండి బాబూ ఇంటికిపోదాం" అంటూ రెక్కపట్టి లేవనెత్తాడు నౌకరు.

జగ్గారావు నీరసంగానే లేచాడు. రావి కొమ్మలు తొలగించబడ్డాయి. మేడ ముందు గేట్లు తెరవబడాయి.

"ఏటి బాబుగోరు! భరించలేని వానవలో ఎలా వున్నారు రేత్రంతా" అంటూ చుట్టూ వున్న గోనెపట్టాను గొంగళీ పురుగును విదిలించినట్లుగా విదిలించి పారేశాడు. దూరంగా అది రోడ్డు మీది వర్షం మురికి నీళ్ళలో పడ్డాది.

నౌకరు అసరాతో వెడుతూ వెడుతూ వెనక్కు తిరిగి చూశాడు జగ్గారావు.

కొండయ్య మూడంకె వేసుకుని నిద్రపోతున్నాడు, తడి గచ్చు మీద.

* * *

ఉదయం తొమ్మిది గంటలయింది. గేరేజీలో వున్న రెండవకారు బయటకు తీయబడింది. జగ్గారావు దాంట్లో ఎక్కాడు. గేటుదగ్గర కారు కొంచెం స్లో చేయబడాది. అప్రయత్నంగానే స్తంభం వేపు చూశాడు. అక్కడ బిచ్చగాళ్లంతా మూగి వున్నారు.

"ఏం జరిగింది డ్రయివర్..." అడిగాడు.

"ఏంలేదుసార్ రాత్రి వానదెబ్బకు, చలి దెబ్బకూ ఎవడో సచ్చాడు" అన్నాడు గేరు మారుస్తూ.

"ఎవరబ్బా..." అన్నాడు అప్రయత్నంగానే.

"వాడేనండి సార్! మిమ్మల్ని గోనెపట్టా ముక్కలివ్వమని వేధించాడే ఆ ముసలాడేనండి..." అన్నాడు.

"అలాగా డ్రైవర్...కారాపు..."అన్నాడు.

"ఏం సార్..." అన్నాడు డ్రైవరు.

"ఏంలేదులే పోనీయ్" అన్నాడు కాస్త విండోగ్లాసు తెరిచి రోడ్డువంక చూస్తూ.

రాత్రంతా తనకు వెచ్చదన మిచ్చిన గోనెగుడ్డ మురికి నీటిలోపడి కుళ్ళి కంపు కొడుతోంది.

"ఈ అడుక్కుతినే వెధవలు ... దేశానికి చీడపురుగులు... డర్టీ రోగ్స్...మురికి మనుషులు" అలా అనుకుంటూ జగ్గారావు వేగం పుంజుకుంటున్న కారులో ప్రయాణం చేస్తున్నాడు.

---

## మనవి

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు తాము పంపే శీర్షిక పేరు రాసి కేరాఫ్ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పూర్తి పేరు, చిరునామా యివ్వడం చింతైనా అవసరం.

— సం.

---

## చిల్లుల వ్యవస్థ

చిరుగుల చొక్కా ఈ వ్యవస్థ
ఎంత కుట్టినా చిరుగు చిరగే
ఆ చొక్కా మళ్ళీ చిరగదని హామీలేదు
అందుకే కొత్తచొక్కా కొనుక్కుందాం

పొత్తూరు రాజేంద్రప్రసాద్‌వర్మ

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

న్యాయమూర్తి శ్రీ మధుసూదనరావుగారు :

"జాతీయ సంపద ఆర్థిక సుస్థిరతపై ఆధారపడి ఉంది. ఆర్థిక సుస్థిరత ఆర్థిక బాధ్యత వల్ల ఏర్పడుతుంది. ఏ ఆర్థిక వ్యవస్థలోనైనా పెట్టుబడిదారుకు లాభం ఉండాలి. అతనికి అందుబాటులోని ధరకు వస్తువులు న్యాయంగా లభించాలి. ఉత్పత్తి చాలదా ? ఉత్పత్తి వల్లేకదా వస్తువులు అందరికీ లభ్యం కావడం ?— అనవచ్చు. ఉత్పత్తి ఎంత జరిగినా, పంపిణీ సరిగా ఉండాలి. పంపిణీ సరిగాలేకపోతే ఉత్పత్తి ఎంత ఎక్కువయినా నిరర్థకం, ఈ పంపిణీ న్యాయంగా జరుగాలి. మనకులేనిదల్లా పంపిణీకి తగిన యంత్రాంగం." అన్నారు న్యాయమూర్తి శ్రీ ఎస్. మధుసూదనరావుగారు నాకు ప్రత్యేకంగా ఇచ్చిన ఇంటర్వ్యూలో. శ్రీ మధుసూదనరావుగారు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తిగా పదవీ విరమణ చేసినపిదప మొనాపలీస్ అండ్ రెస్ట్రిక్టివ్ ట్రేడ్ ప్రాక్టీసెస కమిషన్‌కు చైర్మన్‌గా నియమితులయ్యారు. "ఆరోగ్యకరమైన పోటీ వ్యాపారంలో వుంటేనే ఇదంతా జరుగుతుంది" అని ప్రారంభించారు ఆయన. రెస్ట్రిక్టెడ్ ట్రేడ్ ప్రాక్టీసును కూడా ఈ కమిషన్ అదుపు చేస్తుంది. ఉదాహరణకు తమలపాకులను తీసుకొందాం. ఇది దేశమంతా ప్రజాస్వామ్యం వాడుతున్న వస్తువు. దీనిని తమలపాకుల తోటలవారూ వ్యాపారులూ కూడబలుక్కుని, ఒక ఆకు రూపాయకు అమ్ముదామని నిర్ణయించుకుంటారనుకొండి. అది చాల అన్యాయంకదా, ప్రజల ఫిర్యాదుపైగాని, స్వంత భోగట్టాపైగాని కమిషన్ జోక్యం చేసుకొని, కేసు రిజిష్టరు చేసుకొని, విచారణ ప్రారంభిస్తుంది. ఇలా కూడబలుక్కోడాన్ని కార్టెల్ అంటారు. అంటేకుట్ర. తమలపాకుల పంటకు ఎంతమదుపుపెట్టారు. మొత్తం ఎంత ఖర్చయింది, ఎంత లాభం సంపాదిస్తున్నారు. అనే వివరాలు సేకరించి మితిమీరిన లాభాలు సంపాదించడం సంఘద్రోహంఅని నిర్ణయిస్తుంది కమిషన్. ఎక్కడన్నా ఇలా అన్యాయ లాభాల సంగతి వుంటే, ఎవరైనా కమిషన్ సెక్రటరీ పేర ఫిర్యాదు ఒక కార్డుముక్కలో వ్రాసి పడేయవచ్చు. ఇలాటి నేరాలు తెలుసుకొని ఎట్టుకొనడానికి గుజరాత్‌లో శ్రీ మనూభాయిషా అనే ఆయన కన్‌స్యూమర్స్ రీసెర్చి అండ్ ఎడ్యుకేషన్ సెంటర్ అనే ఒకసంస్థను నిర్వహిస్తున్నారు. దీనితో అర్హులకు నెలకు వేయి రూపాయల జీతమిచ్చి శిక్షణ ఇస్తారు మూడు నెలలపాటు. కొత్త కంపెనీల లైసెన్సులూ మీకు సంబంధించినవేనా? వాటిలో మోసాలు జరుగవా ? అనడిగాను. ఆయన ఇలా అన్నారు. "కొత్త కంపెనీలుతలెత్తకుండా చేయడానికి పెద్ద కంపెనీలు గొప్పఎత్తులు వేస్తుంటాయి. ఒక ప్రఖ్యాతమైన సైకిలు సంస్థ వుందనుకండి. అది సైకిలును వేయి రూపాయలకుఅమ్ముతూందనుకుందాము. మరొక కొత్త సంస్థ కొద్దిపాటి లాభంతో 500 రూపాయలకే ఇస్తానని లైసెన్సు కోరుతుంది. ఈ సంగతికూపీలుతీసి పాతసంస్థ 250 రూపాయలకే సైకిలు అమ్ముతానని ప్రకటించి కొంత కాలం అమ్ముతుంది. ఎంతోకాలంగా వుంది గనుక దానికి వచ్చిన కోట్ల లాభంలో కొంత నష్టం. ఈలోగా కొత్త సంస్థ తట్టుకోలేక చితికిపోతుంది. అది చూచి పాత సంస్థ తనసైకిలుధర ముందు



దానికన్నా ఎక్కువచేసి 1200 అంటుంది. ఇదీ రెస్ట్రిక్టెడ్ ట్రేడ్ ప్రాక్టీసు అంటే. దీనిని అరికట్టడం కూడ మా విధి" ఈ కమిషన్‌లో చైర్మన్‌కాక ఇద్దరు సభ్యులు, ఒక కార్యదర్శి, ఒక సంయుక్త కార్యదర్శి ఉంటారు. దీనికి మూడు శాఖలు, డైరెక్టర్— ఇన్వెస్టిగేషన్, డైరెక్టర్—రీసెర్చి— రిజిస్ట్రార్ — రెస్ట్రిక్టివ్ ట్రేడ్ అగ్రిమెంటు కలకత్తా, బొంబాయి, మద్రాసు రాష్ట్రాలనుంచే ఈ కమిషనుకు ఫిర్యాదులు ఎక్కువగా వస్తుంటాయట. మనరాష్ట్రం నుంచి లేనేలేవట. మన రాష్ట్రంలోని వారికి ఇలాటి సంస్థ వుంది. లాభంపొందండి అని తెలియజేయడం అవసరమని ఆయనఅన్నారు. రాజకీయ నాయకుల ఒత్తిడితో మీరు తగ్గవలసి వస్తుందేమో అన్నాను. "సార్వభౌమ్య ప్రజల రక్తమే నాలో వుంది. నేను ఇప్పుడు తాగే కాఫీ, వేసుకుంటున్న తమలపాకుకూడ ప్రజలవే ననే విషయం మరువలేను. నేను రాజకీయవాదిని కాను. నాకు అధికారం ఇచ్చింది ప్రజలు. దానిని దుర్వినియోగం చేస్తే, దేవుడు నన్ను శిక్షిస్తాడు" అని రావుగారు గట్టిగా అన్నారు. ఏ వుద్దేశంతో తమను నియమించారో దానిని నెరవేర్చడం తమ విధి అని, మంచి పేరు కావాలంటే న్యాయంగా ప్రవర్తించాలని, చెడ్డపేరు కావాలంటే సరిగా ప్రవర్తించనవసరం లేదని ఆయన అన్నారు. "మన రాష్ట్రంలో ఇతర రాష్ట్రాల పెట్టుబడిదారులే ఎక్కువగదా, మీరు తెలుగు వారు కదా, తెలుగు పెట్టుబడిదారులకు ప్రత్యేకంగా ఏదైనా సహాయం చేయగలరా?" అనడిగాను. "రాష్ట్రంలో మనకు ఉపాధి ఏర్పడడం ముఖ్యం. నీ దగ్గర డబ్బుంటే పెట్టు. లేకపోతే పరాయి వారు ఎవరైనా డబ్బు పెడతానంటే అడ్డుపెట్టకు. ఇతరులకు అవకాశం ఇవ్వకపోతే రాష్ట్రంలో పరిశ్రమలు పెరగవు. వారు 60 శాతం తిన్నా, 70 శాతం తిన్నా 30 శాతం రాష్ట్ర ప్రజలు తిన్నా మంచిదేకదా. ఉపాధి అనేది ఒకటి ఏర్పడితే, దానిని క్రమంగా అభివృద్ధిచేసుకోవచ్చు అన్నారు ఆయన. దొంగరవాణా నిరోధం కూడ తమ కమిషన విషయమేనని ఆయన అన్నారు. వ్యవసాయోత్పత్తులను కూడ కమిషన కిందికి తేవడానికి ప్రయత్నిస్తున్నానని, దేశమంతటా వ్యవసాయోత్పత్తుల పరిస్థితిని పరిశీలించడానికి తొలి దశగా పార్వతీపురం వెళ్ళుతున్నానని ఆయన తెలిపారు. ఏజన్సీల మోసం గురించి ప్రస్తావించగా దానిని అరికట్టడానికి గట్టిగా ప్రయత్నిస్తున్నానన్నారు. మధుసూధనరావుగారు విజయనగరంజిల్లా నిడుగల్లు గ్రామములో 1920 అక్టోబర్ 5న జన్మించారు. సాలూరు, పార్వతీపురంలలో హైస్కూలు చదువు తర్వాత విశాఖలోని ఎ. వి. ఎన్. కళాశాలలో పట్టభద్రులై 1941 లో పూనా లా కాలేజీలో న్యాయశాస్త్ర పట్టభద్రులయినారు, బొంబాయి రాష్ట్రంలో ప్రథములుగా. 1943 లో పార్వతీపురంలో వకాల్తా ప్రారంభించి, 1956 లో శ్రీకాకుళానికి మారారు. క్రిమినల్ లాలో చాల ప్రఖ్యాతి గాంచారు. దీనిని గుర్తించి రాష్ట్ర ప్రభుత్వం ఆయనను 1958 లో కలివరం డకాయిటీ కేసులో ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమించడంలో ఆశ్చర్యమేమీ లేదు. 1959 లో జిల్లా సెషన్సు జడ్జిగా నియమితులైనారు.

### గమనిక

పాఠకులు పద్దు వంటలే పడితే "ఎప్పుడూ అవే" వంటలా? అంటారు కనుక 'వంటలు' పంపేవారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని—సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

సం.

## ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

### సీరియల్

29.1.82 వెలువడిన ముఖచిత్రం నటి రాధిక చాల బాగుంది. "తార" "జీవితవనంలో కొత్తగాలి" రెండు ఇంటరెస్టుగా సాగుతున్నాయి.

దేవి, పద్మ, విజయ (జవిగాల్లపల్లి)

* * *

29.1.82వ తేదీన వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి రాధిక ఆకర్షణీయంగా ఉంది. "జీవితవనంలో కొత్తగాలి" "తార" సీరియల్స్ రెండూ చాలా ఇంటరెస్టుగా సాగుతున్నాయి.

సత్య, శ్రీనివాసు. జి. (కొవ్వూరు)

* * *

29.1.82 ఆంధ్రసచిత్ర వారపత్రికకు నటి రాధిక ముఖచిత్రం చాలా బాగుంది. "జీవితవనంలో కొత్తగాలి" సీరియల్ మా ఇంటిల్లిపాదిని ఆకర్షిస్తోంది. "పెన్‌ఫ్రెండ్" పెద్దకథ ఆసక్తికరంగా ఉంది.

ఎస్. సునీత (తెనాలి)

* * *

"జీవితవనంలో కొత్తగాలి" సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది. "తార" సీరియల్ కూడా బాగుంది.

ఈ వారం పత్రికలో కార్టూన్స్ బాగున్నాయి.

పిహెచ్. సుధారాణి (చంపాడు)

### సంక్రాంతి సంచిక

సంక్రాంతి ముచ్చట ముఖచిత్రముతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక చూడ ముచ్చటగా ఉంది. సీరియల్స్ రెండూ చాలా ఇంటరెస్టుగా ఉన్నవి. కార్టూన్లు కడుపుబ్బ నవ్వించాయి.

జె.ఎన్. నాయుడు, ఎస్.ఎం.హనీఫ్ (కువైట్)

సంక్రాంతి ప్రత్యేక సంచికలో హీరో కమ్ విలన్ తిరుమల సౌందర శ్రీరంగనాద్ యూ మై కరెక్ట్? "చేతిలో ఏ రేఖా చెప్పలేక పోయింది." చదివాక సాహితీ లోకం నుంచి పట్టాలు తప్పి సినీమాయలో పడ్డారేమో బాబోయ్ అన్పించింది. ఏమైనా హైలైట్ ఆఫ్ ది వీక్లీ ఈ కథ కథ రచన తీరులో కూడా ప్రత్యేకత కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది.

టి.వి.యస్.మూర్తి [హైదరాబాద్]

* * *

మీరు 22—1—82 సంక్రాంతి సంచికలో ప్రచురించిన "టి. యస్. యస్. రంగనాద్" రచించిన "చేతిలోని యే రేఖా చెప్పలేక పోయింది" కథలోని పిల్లవాడి దయనీయ గాథ చాల విపులంగా చెప్పారు. కె. రామలక్ష్మి 'శ్రావణి' ఆత్మీయులతో మాట్లాడినట్లుగా ఉన్నాయి ఆమె జవాబులు. డాక్టర్ కె. వెంకటేశ్వరరావు సలహాలు చాల విపులంగా చెప్తున్నారు. పత్రిక మొత్తానికి చాల ఇంటరెస్టుగా ఉన్నాది.

ఎల్. గోపాల్ [గాడవల్లి]

## హైదరాబాదు నోట్‌బుక్

పిదప ఫస్ట్‌గ్రేడ్ జిల్లా జడ్జి, క్రమశిక్షణ ట్రిబ్యునల్ చైర్మన్‌గాను, హైదరాబాద్ సిటీ సివిల్ కోర్టు ప్రిన్సిపల్ సెషన్స్ జడ్జిగాను పదవులు నిర్వహించి 1974 లో రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి అయ్యారు. ధైర్య సాహసాలు, సమర్థత గల న్యాయమూర్తిగా యశస్సు సంపాదించారు. రావుగారికి వివిధ విషయాలలో ఆసక్తి వుంది. టెన్నిస్ క్రీడ, బ్రిడ్జి క్రీడ, తోటపని అంటే ఆయనకు చాల ఆదరం. రాష్ట్ర బ్రిడ్జి క్రీడాకారుల సంఘానికి ఆయన ప్రస్తుతం అధ్యక్షులు. ఆయన ఉత్సాహముతో పొంగులు వారుతుంటారు. ఆయన దృష్టి నిశితం, న్యాయవిలసితం, మేధా విభాసితం, నిరంతరం ప్రజాసామాన్య శ్రేయస్సే ఆయన ధ్యేయం. ఆయన న్యాయవాదిగాను, న్యాయమూర్తిగాను ఈ ధ్యేయంతోనే వున్నారు. ఇకమీద కూడా వుంటారు. అన్యాయానికి తగ్గని, ఒత్తిడులకు మెత్తబడని దొడ్డమనసు ఆయనది. ఆయన నూతన పదవి ప్రజాసామాన్యానికి ముఖ్యంగా ఆంధ్రావళికి ప్రయోజనకరం కాగలదనడంలో సందేహం లేదు.

**ఉపశ్రుతి :**

ఏమిటిసార్, వారిద్దరూ రామలక్ష్మణులమని చెప్పుకొని తిరిగే వారు. ఇప్పుడు ఏమయింది— అన్నారు చాల కాలం జంటగా తిరిగిన నాయకులను గురించి. 'అవును వారిలో ఒకరేమో మొదట్లో రెండవవారిని రామా రామా అనేవారు. విడిపోయిన తర్వాత రామారామా రామారామా అనుకుంటున్నారు.' అన్నారు, మా సంభాషణ వింటున్న మిత్రులు డాక్టర్ అంతటి నరసింహం.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna